# సాహిత్య సుదర్శిని

(వ్యాస మాలిక)

తెలుగు విశ్వవిద్యాలయం వారి
ఆర్థిక సహాయంతో
ముద్రింపబడినది

**డాక్టర్ వాడపల్లి చక్రపాణిరావు, M A; M.Phil; Ph D;**

తెలుగు రీడర్,

శ్రీ కోనసీమ భానోజీ రామర్సు కళాశాల,

అమలాపురం.

సాహిత్యసమర్చన (వ్యాసమాలిక)

ప్రథమ ముద్రణ, 1993 మార్చి
ISBN-81-900146-1-7

మూల్యము : రూ. 20/-

ప్రతులకు :
శ్రీమతి వాడపల్లి సూర్యకుమారి,
మాస్టర్ కుటీర్, కొంకాపల్లి,
అమలాపురం – 533 201

గ్రంథ పరిష్కరణ :
పండితరాయ రిసెర్చి సెంటర్,
ఎస్. కె. బి. ఆర్. కాలేజి,
అమలాపురం.

గ్రంథ ముద్రణ :
ఆర్. కె. ప్రింటర్స్,
మావిరాజు వీధి, అమలాపురం.
ఫోన్ : 21419

# మా మాట

'సాహిత్యసుదర్శిని' ముచ్చటైన మా మూడవ ప్రచురణ. ఇంతకుముందు ప్రచురించిన 'తెలుగులో భాషాశాస్త్రపరిణామ వికాసాలు' (1985), 'ఆంధ్రమహాభారతము-ద్రౌపది, ఒక ఐతిహాసికవిశ్లేషణ' (1990)లను ఆదరించినట్లుగానే ఆంధ్రపాఠక లోకం ఈవ్యాససమాహారానికూడా ఆదరిస్తుందని ఆకాంక్షిస్తున్నాం.

ఈగ్రంథ ప్రచురణకు ఆర్థికసహాయం అందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి మా ధన్యవాదాలు.

ఈసంపుటిలోని వ్యాసాలను లోగడ ప్రచురించిన 'నావాణి', 'కోస్తావాణి', 'సమాలోచన', 'ఆంధ్రభూమి', 'సప్తగిరి' పత్రికల సంపాదకులకు కృతజ్ఞతలు.

ఈవ్యాససంపుటిని తీర్చిదిద్దటంలోను, ప్రచురణకు ప్రోత్సహించటంలోను సహకరించిన పండితారాధ్య రిసెర్చి సెంటర్ వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు.

ముఖచిత్రాన్ని తీర్చియిచ్చిన చిరంజీవి వి. ఏడుకొండలు (పూజా)కు, నాపట్ల అత్యంత గౌరవంతో 'ముందుమాట' రచించి యిచ్చిన చిరంజీవి యస్వారెన్ గొల్లారి (తపస్వి) కి మా శుభాశీస్సులు.

ఈసంపుటిలోని వ్యాసాలపై మీమీ స్పందనలను మాకు తెలియజేస్తే సంతోషిస్తాం.

ఇట్లు,

మాస్టర్‌పేటీర్
3-3-1993

డాక్టర్ వాదవల్లి చక్రపాణిరావు
శ్రీమతి వాదవల్లి సూర్యకుమారి

# విషయసూచిక

# 1. కవిత్రయ భారతం దార్శనిక పరివర్తనం

వ్యాస విరచిత సంస్కృత మహాభారతాన్ని వివిధ కాలాలకు చెందిన ముగ్గురు తెలుగు కవులు ఆంధ్రీకరించారు. నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱన లనబడే ఆ ముగ్గురు కవులను సాహిత్యచరిత్రకారులు 'కవిత్రయం'గా వ్యవహరిస్తున్నారు.

*"సరస సంస్కృత పుష్పగుచ్ఛ ప్రభూత*
*మగు తెనుంగను నెత్తావి కఖిలదిశలఁ*
*దరుణి పవమానమగు కవిత్రయ విశేష*
*చతుర వాచానిరూఢి కంజలి ఘటింతు"*

'సంస్కృతమనే పుష్పగుచ్ఛంనుండి వెలువడిన తెలుగనే పరిమళాన్ని అన్నిదిశలా గుబాళింపజేసిన మందమారుతం వంటి కవిత్రయం వారి మాట నేర్పరితనానికి జైమోడ్పులు' అంటూ 'రాజశేఖరచరిత్రము' లో మాదయగారిమల్లన కవిత్రియంవారి భారతరచనను కీర్తించాడు.

ఆధునికులైన విమర్శకులు 'ఆంధ్రమహాభారతం మూలానుసారిగా ఉన్న స్వతంత్ర రచన' మని తెల్పారు.

"- - ఆది స్వతంత్రమైన యనువాదము. అనువాదమయ్యు స్వతంత్రతా గుణశోభితము కాఁజాలుటయే యందలి వైశిష్ట్యము ." అని కీ॥ శే॥ ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు,

"... సంస్కృతాంధ్ర భారతములకు విశేషముగా భేదము కనిపించుచున్నందున కవిత్రియము వారిది యథాను

వాదము కాక, స్వతంత్రానువాదము, కథానువాదము అని చెప్ప వలసివచ్చుచున్నది'' అని కీ॥ శే॥ ఆచార్య కేతవరపు వేంకట రామకోటిశాస్త్రిగారు,

'(తిక్కనగారి భారతము) భాషాంతరీకరణముగాక భావాంతరీ కరణమే యని చెప్పనొప్పును' అని డాక్టర్ నండూరి రామ కృష్ణమాచార్యగారు,

'(నన్నయ) సంస్కృతభారతమును ఆధారముగాగొని తన రచనను దాదాపు స్వేచ్ఛగా కొనసాగించెను. కనుక దానిని ఛాయానుసరణ మనుట యుక్తము' అని శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు, తమతమ గ్రంథాల్లో పేర్కొన్నారు. ఇవీ ఇటువంటివే అయిన ఇతరాభిప్రాయాలూ కవిత్రియం వారి భారతం అనువాదంలా కనిపించే స్వతంత్రసృష్టి అని చాటు తున్నాయి.

భిన్నకాలాలకు చెందిన ఈ ముగ్గురు కవులూ జగద్ధి తాన్ని పరమప్రయోజనంగా పెట్టుకుని వ్యాస హృదయాన్ని తెలుగువారికి బోధపడేట్లు చేయడానికి మాత్రమే యత్నించారు. సంస్కృతభారతాన్ని యథాతథంగా అనువదించడమనే ప్రసక్తే వారు పెట్టుకోలేదు.

నన్నయ ''మహాభారత నిరూపితార్థనము 'ఏర్పడ' తెనుఁగున రచియించి''నాడు.

తిక్కన "అమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు" చేశాడు.

ఎఱ్ఱన, "నన్నయభట్టమహాకవీంద్రుని సరససారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ జెందుటయు, సాధుజన హర్షసిద్ధిగోరి -- తత్కవితారీతియుఁ గొంతదోఁప దత్రచనయకాఁ" అరణ్యపర్వాన్ని పూరించాడు.

వ్యాసభగవానుడు సంస్కృతభారతాన్ని 'తన విమల జ్ఞానమయంబైన వాగ్దర్పణంబున' తనకు తెలిసిన సమస్తవిజ్ఞానమూ, శ్రీకృష్ణునిమహాత్మ్యమూ, పాండవాదివీరుల మహాగుణాలూ స్పష్టంగా వెలుగుతూఉండగా, ఈ లోకాలను బ్రహ్మ సృష్టించినట్లుగా మూడుసంవత్సరాలు తదేకధ్యానంతో ఉండి రచించాడు.

అంటే --

మహాభారతం ఇప్పటి మనచరిత్రల మాదిరిగా లభ్యమైన ఏవోకొన్ని చారిత్రకాధారాల సహాయంతో వ్రాయబడిన గ్రంథంకాదు. జరిగినసన్నివేశాలను ప్రత్యక్షీకరించుకుని వ్రాయబడినదన్నమాట!

అదెలా సాధ్యం అన్నదానికి సమాధానం భారతంలోనే ఉంది. సంజయుడు ఉపప్లావ్యానికి రాయబారిగా వచ్చి, సభలో ధృతరాష్ట్రుని అంతర్యాన్ని మహాద్భుతంగా ఆవిష్కరించాడు.

అతనికి ధృతరాష్ట్రుడు చెప్పిందీ లేదు, ఏమి చెప్పమంటావని సంజయుడు అతణ్ణి అడిగిందీలేదు. అలాగే, ఒక ప్రైపునయుద్ధం జరుగుతూ ఉండగా ఆ యుద్ధ సంబంధమైన విశేషాలనూ, ఆయా వ్యక్తుల రహస్యసంభాషణలు, మనోగతభావాలతో సహా, సంజయుడు వ్యాసునిఅనుగ్రహంతో ధృతరాష్ట్రునికి నివేదించాడు. అర్జునునికి శ్రీకృష్ణుడుఉపదేశించిన "భగవద్గీత" మొత్తం సంజయుడు గ్రహించి వివరించినదే! శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని అర్జునునితోపాటు సంజయుడూ దర్శించాడు. సంజయునికి ఈ సామర్థ్యం ఎలా కలిగిందో కూడా భారతం వివరించింది. 'సాత్త్విక, రాజస, తామస వికారంబులత్రిప్పలం బడక ధర్మంబాచరించుచు భావశుద్ధి కలిగియుండుటవల్ల తనకు వాసుదేవతత్త్వం అవగతమయిందనీ, ఎవరికైనాసరే అవిధంగా ఉంటే అది సాధ్యమేననీ సంజయుడే ఉద్యోగపర్వంలో ధృతరాష్ట్రునికి వివరించాడు. మహాభారత యుద్ధానంతరం పదహారు సంవత్సరాల తర్వాత వ్యాసభగవానుడు గాంధారీధృతరాష్ట్రుల కోరికమేరకు యుద్ధమృతులైన భారతవీరులందరినీ దర్శింపజేసి, కౌరవస్త్రీల శోకాన్ని పోగొట్టాడు.

సంజయునికి దివ్యదృష్టిని ఇచ్చి వర్తమాన సన్నివేశాలను, ధృతరాష్ట్రాదులకు దివ్యదృష్టిని ఇచ్చి పురామృతులను ప్రత్యక్షీకరింపజేసిన వ్యాసమహర్షి, లోక హితార్థమై భారతరచన చేస్తూ, జరిగిన ఆయా సన్నివేశాలను దివ్యదృష్టితో వీక్షిస్తూ ప్రాశాడనటం అతిశయోక్తి ఎంతమాత్రమూ కాదు.

సాత్యవతేయుని. ఈఇతిహాసరచనాపద్ధతిని కవిత్రయం వారు పట్టుకోగలిగారు. ఆంధ్రమహాభారతాన్ని రచించడంలో వారు ఇంచుమించుగా ఇదేపద్ధతిని అనుసరించారు. వారు వ్యాస మహర్షిని వర్ణించినతీరును పరిశీలిస్తే వారికి ఆయనపట్ల ఎంతటి భక్తిప్రపత్తులు ఉన్నాయో స్పష్టపడుతుంది.

నన్నయ, దివ్యుడైనపరాశరాత్మజాంభోరుహమిత్రుని గొల్చి, చేతోరుచిరాబ్జబోధనుఁడై, తెనుఁగున మహాభారత సంహితా రచన బంధురుఁడయ్యాడు. (ఆది 1-22, 25)

తిక్కన,"-- సాత్యవతేయసంస్మృతి శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వదీక్షావిధినొంది--" "--అంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహాకావ్యంబు సర్థంబు సంగతము" చేశాడు. (విరాట - 1 - 30, 37)

ఎఱ్ఱన, అరణ్యపర్వపూరణంలో తనదంటూ ఏమీ లేదనీ, అంతానన్నయగారిదేననీ చెప్పుకున్నాడు. (అరణ్య-7-468)

భారతసంహితను కూర్చడంలో వ్యాసునిపరమార్థాన్నీ, ప్రణాళికనూ ఈకవులుముగ్గురూ గ్రహించవలసినతీరులో గ్రహించగలిగారు. కనుకనే వారికి వ్యాసుని ఇతిహాసరచనా విధానం కూడాబోధపడింది. వ్యాసునిలాగానే వారూ మహా కవిత్వదీక్షవిధినిపొంది, అంతస్సన్నిధిలో మహాభారతగాథను

ప్రసన్నం చేసికొని తెలుగున అందించారు. కాబట్టే తెలుగుభారతం వ్యాసుడే దిగివచ్చి రచించినట్లుగా మహావైభవంగా సాగింది.

అంతస్సన్నిధితో కావించే ఇటువంటి రచనను "దార్శనిక పరివర్తనం" (Transcreation) అనడం సముచితంగా ఉంటుంది. మూలవిధేయంగా ఉంటూ స్వతంత్రంగా ఉండటం దీని ప్రధాన లక్షణం. పోతన మహాకవి భాగవతప్రారంభంలో

*"పలికెడిది భాగవతమట*
*పలికించెడి విభుండు రామభద్రుండట"*

అనిచెప్పుకొన్నట్లుగానే కవిత్రయంవారూ

*"పలికెడిది భారతంబట*
*పలికించెడి విభుండు వ్యాసభగవనుండటే"*

అన్నట్లుగా భారతరచన కావించారు.

వారికి ఈమార్గం వ్యాసుడు చూపిందే కావటం విశేషం! కవిత్రయభారతానికి దక్కిన ప్రశస్తీ, ప్రామాణికతా, ప్రాభవాలకు అసలు కారణంఇదీ!

ఇంతేకాని, కొందరువిమర్శకులు ఊహించినట్లుగా నన్నయాదులు తమనాటి తాళపత్రప్రతులన్నింటినీ సంపాదించి, దగ్గరపెట్టుకుని పరిశీలిస్తూ, అవసరమనిపించిన తావుల్లో

మార్పులూ, చేర్పులూ చేస్తూ, ఇప్పటి అనువాదోద్యోగుల్లా భారతాన్ని అనువదించారని చెప్పడం భావ్యంకాదు.

ఈదృష్టితో చదివితే ఆంధ్రమహాభారతవైభవం మరింతగా హృదయానికి అనుభూతమవుతుంది.



# 2. మహాభారతం - స్త్రీతత్త్వనిరూపణం

వ్యాసభగవానుడు మహాభారతగ్రంథాన్ని "పాండవుల కీర్తిం బ్రకటించుటకును, దేవదేవుండగు వాసుదేవునిసంక్రీడా విశేషంబులు వివరించుటకును...." రచించినట్లుగా స్వర్గారోహణ పర్వం చివరన చెప్పబడింది. మహాభారతాన్ని సూక్ష్మంగా వివేచించిన పెద్దలు దానిలో హరిహరాద్వైతం ప్రతిపాదించబడి నట్లుగా కూడా చెబుతారు. అంతకుమించి, ఆమహేతిహాసంలో స్త్రీతత్త్వం అంతర్లీనంగా ప్రతిపాదించబడిందనే విషయాన్ని గమనించినప్పుడు ఆశ్చర్యమూ, ఆనందమూ కలుగుతాయి.

సంభవపర్వంలో ఎవరెవరేయేఅంశలతో జన్మించారో వివరిస్తూ ద్రౌపదినిగూర్చి "శ్రీమూర్తి యాజ్ఞసేనియైపుట్టె" నని తెలిపాడు మహాకవి నన్నయ. స్వర్గారోహణ పర్వంలో దేవ భావం పొందిన ధర్మజుడు ఉదాత్తమూర్తితో వెలుగొందుతున్న ద్రౌపదిని గుర్తుపట్టలేక, ఇంద్రుని 'ఈమె ఎవర'ని ప్రశ్నిస్తాడు. అప్పుడతడు, "ఈభామ మహాలక్ష్మి ద్రౌపది యనఁగ ద్రుపదు నికిఁ గూఁతురై యయోనిప్రభవంబగు మానుషరూపంబు మహిత లీలముగఁదాల్చి భవదనుభూతి సెల్లించె గౌరీశ్వరునాజ్ఞ వహించి వచ్చె" నని చెప్పాడు. తిక్కన సోమయాజి మాటలివి.

సంస్కృతభారతంలోని ఆదిపర్వంలో

*"స్వర్గశ్రీః పాండవార్థాయ సముత్పన్నా మహామఖే*
*సేఽహ తప్త్వా తపోఘోరం దుహితృత్వం తవాగతా!"*

అని చెప్పబడింది.

స్వర్గలక్ష్మి ( శ్రీ దేవి ) ఈశ్వరసంకల్పానుసారంగా ద్వాపరయుగంలో ద్రుపదపుత్రికగా అవతరించింది. ఆమె శ్రీకృష్ణుని జగద్వ్యూహంలో భర్తలైన పాండవులతోపాటు తన వంతు పాత్రను తాను చక్కగా నిర్వహించి "గోవిందుని చెలియలి" నని చాటుకుంది. లలితాసహస్రనామస్తోత్రం శ్రీదేవిని "పద్మనాభసహోదరీ" అనీ, "విష్ణుమాయావిలాసినీ" అనీ పేర్కొంటున్నది. ఈ తత్త్వం మొత్తం భారతంలో విస్తరించి ఉంది. అది ఎలాగో చూద్దాం.

దిగ్విజయం చేసి, రాజసూయయాగం కావించిన పాండవులవైభవం అనన్యసామాన్యం. అలాంటి పాండవులను ప్రాభవశూన్యులుగా చేయాలని సంకల్పించాడు దుర్యోధనుడు. ఆ సంగతి తెలిసే తల ఒగ్గాడు ధర్మజుడు. నిండుసభలో కట్టుకున్న భార్యను అన్యాయంగాఅవమానిస్తున్నా సహించి ఊరుకొన్నారు ఆ ధర్మజానుజులు. వారలా ఎందుకు ఊరుకో వలసివచ్చింది? పాండవులైదుగురికీ ద్రౌపదికాక వేర్వేరుగా ఎవరిభార్యలు వారికి ఉండగా ఒక్క ద్రౌపదికే ఈఅవమానాలు,

కష్టాలు భరించవలసిరావడం ఏమిటి? మొదలైన అంశాలెన్నో నిదానించి పరిశీలింపదగినవి. కురుసభలో పరీక్షకు పెట్టబడినవి పాండవుల పరాక్రమమూ, బాహుబలమూ కావు. ధర్మజుని ధర్మదీక్ష, ద్రౌపది పాతివ్రత్యమూను! అంతటి దురవస్థలోను ధర్మజుని ధర్మదీక్షనుగురించి -

*"అనుపమ దైవయోగ హతుఁడయ్యు నవశ్యము ధర్మసంపదం దనరుచుఁ గాని ధర్మజుఁడు ధన్యుఁడు ధర్మపథంబు తప్పఁ దాఁ జనునె?" అని చాటి చెప్పింది ద్రౌపది.*

నిండుసభలో కర్ణుడు 'లోకవిరుద్ధంగా బహుభర్తలుగల ఈమె బంధకి - ఈమెను విగతవస్త్రను చేసినా తప్పులేదన్నాడు. కానీ, కౌరవులు ఆమెనలా చేయగలిగారా? చివరికి ఏసభలో అయితే ఆమెను దూర్చిననింద జరిగిందో అదేసభలో సార్వభౌముడైన ధృతరాష్ట్రునిచే ఆమె పరమపతివ్రతఅనీ, తపస్వినిఅనీ, పాండవులధర్మపత్నిఅనీ, అయోనిజఅనీ, ప్రకృతిమానవభామినిగా తలపదగినది కాదనీ ప్రశంసలు అందుకొంది.

ఆ సందర్భంగా ధర్మంకోసం ఎవరు నిలబడతారో వారికోసం దైవం దిగివస్తాడన్నసత్యం మరొక్కసారి ఆవిష్కరించబడింది. ఇంతటికీ మూలం ద్రౌపదీపాండవులకు శ్రీకృష్ణునిపట్ల గల అనన్యభక్తి మాత్రమే! ద్రౌపదియొక్క పద్మనాభసహోదరత్వం, విష్ణుమాయా విలసనం ప్రకటితమైన మహత్తర సన్నివేశం ఈ ద్రౌపదీపరాభవఘట్టం.

శ్రీమద్భాగవతంలో ఇలా ఉంది.

*"పాంచాలీకబరీ వికర్షణ మహాపాపక్షతాయుష్కులం*
*జంచద్గర్వుల ధార్తరాష్ట్రుల ననింజంపించి గోవిందుఁడి*
*ప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకుఁ గల్పించెన్ మహాఖ్యాతిఁజే*
*యించెన్ మూఁడు తురంగమేధములు దేవేంద్రప్రభావంబునన్"*

దీనికి అర్ధం : ద్రౌపదిని జుట్టుపట్టుకుని ఈడ్చటమనేమహాపాపం చేసినకౌరవులు తమ ఆయుష్షులనుకోల్పోయారు. వారినియుద్ధంలో చంపించి, రాజ్యాన్ని ధర్మజునికి అప్పగించి. అతనిచే మూఁడు అశ్వమేధాలు చేయించాడు శ్రీకృష్ణుడు.

జగద్గురుడైన శ్రీకృష్ణుని జగద్వ్యూహాన్ని, ఆవ్యూహంలో ద్రౌపదీదేవిపాత్రను చక్కఁగా వివరిస్తుంది ఈపద్యం.

మరికొన్ని విశేషాలు కూడా చూద్దాం.

ద్రౌపది శ్రీమాత అవతారమని నిరూపించబడినఅంశాలు మహాభారతంలో ఎన్నోఉన్నాయి. ద్రోణునిచే అవమానించబడిన ద్రుపదుడు ద్రోణుని చంపగలకొడుకూ, అర్జునునికి భార్యకాగల కూతురూ కలగాలనిసంకల్పించి, యాజుని ఆశ్రయించాడు. యాజుడు నిర్వహింపజేసిన పుత్రకామేష్టి ఫలితంగా యజ్ఞకుండం నుంచి ఆయుధహస్తుడై ధృష్టద్యుమ్నుడూ, దివ్యమైనతేజస్సూ, ప్రసన్నమైనమూర్తి కలిగి ద్రౌపదీ ఆవిర్భవించారు. శ్రీమాత 'చిదగ్నికుండసంభూత' - చిత్ + అగ్ని = చిదగ్ని అవుతుంది.

ద్రుపదునిచిత్తంలో కలిగిన సంకల్పమనే అగ్ని కదా ఆమె అవతరణకు నిమిత్తకారణం!

యముడు సత్రయాగదీక్షలో ఉండి ప్రాణిహింస చేయడం మానివేశాడు. దానితో మర్త్యులు అమర్త్యులయ్యారు. దేవతలు అది సహించలేకపోయారు. బ్రహ్మతో మొరపెట్టుకున్నారు. బ్రహ్మ వారికి అభయమిచ్చి పంపాడు. వారు తిరిగివస్తూ ఆకాశగంగలో నిలబడి యేడుస్తున్న స్వర్గలక్ష్మిని చూశారు. ఎందుకు ఏడుస్తున్నావని ఇంద్రుడామెను అడిగాడు. ఆమె ఇంద్రుని తనతో రుద్రుని కడకు తీసుకువెళ్ళింది. అక్కడ ముందే మరో నలుగురు ఇంద్రులు రుద్రప్రభావంతో రూపుకట్టుకుని ఉన్నారు. ఈ పంచేంద్రులూ దేవాహితార్థమై మానవులుగా పుట్టవలసి వచ్చింది. వారికి పత్నిగా అవతరించింది స్వర్గలక్ష్మి. ఈవిధంగా ద్రౌపది "దేవకార్యసముద్యత!"

శ్రీదేవి "మహాలావణ్యశేవధిః". నన్నయగారు ద్రౌపదిని గూర్చి గాంధారి కోడళ్ళందరూ

*"అఖిల లావణ్య పుంజంబు నబ్జభవుఁడు*
*మెలఁతగా దీనియందు నిర్మించెనొక్కొ*
*కానినాఁడిట్టి కాంతి యేకాంతలందు*
*నేలలేదని సామర్ష హృదయలైరి"*

అనిచెప్పారు. గాంధారి కోడళ్ళకు మాత్రం అందాలకు ఏం తక్కువ? కానీ ద్రౌపది యందుగల లావణ్యం వారియందులేదు.

వారు మానవభామినులు. ద్రౌపది శ్రీమూర్తి అవతారం - అంతర ముండదా మరి? అమ్మవారు,

*"పంచయజ్ఞప్రియా పంచప్రేతమంచాధిశాయినీ*
*పంచమీ పంచభూతేశీ పంచ సంఖ్యోపచారిణీ!"*

కనుకనే ఆమె ఈశ్వరపర ప్రభావాన పంచభర్తృక అయ్యింది. ద్రుపదుడు సంకల్పించినది అర్జునునికే భార్యకాగల కుమార్తెనే- అయితేనేం, ఈశ్వరుడు ద్రుపదుని సంకల్పాన్ని లోకహితానికి అనుగుణంగామలిచి, ఆమెకు పంచపతిత్వాన్ని అనుగ్రహించాడు.

వ్యాసుడు స్ఫురింపజేసిన ద్రౌపది శ్రీమాతృత్వాన్ని కవిత్రయంవారు చక్కగా అందుకున్నారు. కనుకనే వారు ద్రౌపదీ సౌందర్యవర్ణన సందర్భంగా ఒక నియమాన్ని పాటిం చారు. ఆమెను తాముగా ఏసందర్భంలోను అంగాంగవర్ణన చేసి రూపసాక్షాత్కారం కలిగించలేదు. ఆమె "మనోవాచామ గోచర"గా చెప్పబడింది కనుక బహుశా తన్నిరూపకంగా వారీ నియమాన్ని పాటించి ఉండవచ్చు. కథలోని ఆయాపాత్రలకు ఆమె దర్శనం ఇచ్చిన తీరును వర్ణించడంలో కూడా వారు ఆమె దివ్యత్వమే ప్రస్ఫుటమయ్యేటట్లు చేశారు. ఉదాహరణకు, సైంధ వుడు ఆమెను దూరంనుంచి గమనించి, 'సురోత్తమకన్యయో, యక్షకాంతయో, పన్నగభామయో' అనుకొన్నాడు. "మనుజ భామినిగాదు నిజంబు" అనే నిర్ధారణకు కూడా వచ్చాడు. అలాగే,

గంధకారికావేషంతో ద్రౌపది విరాటనగరం ప్రవేశించగానే జను లామెను చూసి,

> *'రోహిణీ యొండె/ నొండెను నరుంధతిగాక మనుష్యజాతియే*
> *యీ హరిణాక్షి ..'*

అనుకొన్నారు. సుదేష్ణ ఆమెను తనవద్దకు రప్పించుకొని, వివరాలడిగి, నమ్మలేక,

> *'సుర గరుడ ఖచరవిద్యా*
> *ధర కిన్నర యక్ష సిద్ధ తరుణులలోనీ*
> *వరయగ నొక్కత వగుది*
> *వ్వారికిం జనుదేరఁగతము బొంకక చెపుమా!'*

అని రొక్కించి అడిగింది. "మాలిని" రూపంలోఉన్న ద్రౌపది సుదేష్ణ ఉన్న మేడ పైభాగానికి వెడుతూన్న సన్నివేశాన్ని తిక్కనగారు మహాద్భుతంగా వర్ణించి, ఆమె సాక్షాత్తు పరమేశ్వరియే అని నిరూపించారు.

ఆమె పాదాల ఎఱ్ఱదనం సోకి పరిసరాలు కుంకుమపూత పెట్టినట్లుగా అయ్యాయట! అంటే, ఆమె "పదద్వయప్రభాజనిత పరాకృతసరోరుహ" అన్నమాట! ఆమె శరీరకాంతివల్ల గోడలూ వేదులూ మణిమయంగా భాసించాయని చెప్పి, ఆమె "ప్రభావతి" "ప్రభారూప" అని నిరూపించారు. ఆమె కంటి మెరుగులు వ్యాపించినభాగాలు పుష్పహారాలతో అలంకరింపబడినట్లయ్యాయని చెప్పి, ఆమె "కటాక్షకింకరీభూతకమలాకోటి సేవితా",

"లోలాక్షి", "పద్మనయనా", "విశాలాక్షి", అని నిరూపించారు! ఆమె శిరోజాలకాంతికి మేడ పైభాగమంతా నల్లటి బట్టపరచి నట్లయిపోయిందని ఒక వర్ణన. ఆమె శిరోజాలు అంత కాంతివంతాలన్నమాట! అమ్మవారు "అష్టమీచంద్రవిభ్రాజ దళికస్థలశోభితా" గదా! ఆమె ప్రవేశించడంతో రాజభవ నంలో క్రొత్త అందాలు అతిశయించాయని చెప్పి, "నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండ మండలా" త్వాన్ని వివరిం చారు తిక్కనగారు. ఈవిధంగా ఆమెను ఆపాదమస్తకం ఒక దివ్యమూర్తిగా వర్ణించినసందర్భం కవిత్రయభారతంలో ఇదొక్కటే. గంధకారికావేషంవల్ల ఆమెమూర్తి యుజ్జ్వలత్వం మరువడటంవల్ల ఆమె దర్శనీయ అయ్యిందనే విషయాన్ని మహా కవి పరోక్షంగా ప్రతిపాదించాడిక్కడ. ఆమె రూపంలోని తేజస్సు, దివ్యత్వమూ కామునిపైనకీచకుని కూడా ఏంతో ప్రభావితం చేసింది. వాడూ ఆమెను ఆపాదమస్తకమే వర్ణిం చాడు. అమె 'మచిరమూర్తి'నే కాని నీచంగామాత్రం కాదు.

ద్రౌపదికి 'కృష్ణ' అని మరొక పేరుంది. అదే ఆమె అసలైన నామం. కృష్ణవర్ణం కలిది కనుక కృష్ణ అయ్యిందం టారు. అమ్మవారు 'శ్యామాభా' - సరిపోయింది. అంతకు మించి, కృష్ణ శబ్దానికి కర్షణము చేయునది అని మరొక అర్థం కూడా ఉంది. ఎవరెవరికి కాలం చెల్లిపోయిందో వారువారు ఆమెపట్ల ఆకర్షితులై నశించిపోయారు. లేకపోతే, ఏయుగం లోనూ ఎవ్వరూ చేయనిపనికి దుర్యోధనాదులు సాహసించడ

మేమిటి? ఆమె కారణంగా వారు నశించారంటూఉంటాం. కానీ, అందుకు బాధ్యురాలు ఆవిడా? విస్మృత్పరికరాన్ని తాకడంవల్ల ఆఘాతం కలుగవచ్చు. తప్పు పరికరానిదెలా అవుతుంది? దానిపట్ల జాగ్రత్త వహించవలసింది మనం. ద్రౌపది దివ్యత్వాన్ని గమనించీ పట్టించుకోకుండా అహంకరించినవారు వారి పాపానికి వారు బలికాక తప్పుతుందా? ఆమె "దండనీతిస్థా" అని మరచిపోకూడదు.

# 3. ద్రౌపదీపాత్ర ప్రత్యమహిమ

ప్రపంచసాహిత్యంలో మహాభారతంవంటి మరోమహా గ్రంథం ఉంటే ఉండవచ్చునేమోగాని, ద్రౌపదీదేవివంటి మహోన్నతమైనపాత్ర మాత్రం ఎక్కడా కనిపించదు. పంచభర్తృక అయినా పాంచాలి మహాపతివ్రత. ఇదీ పరమాద్భుతం!

అయిదుగురు భర్తలకు పత్నిఅయిన ద్రౌపది పతివ్రత ఎలాగవుతుంది? అన్న ప్రశ్న మనమనస్సులను బాధిస్తూఉంటుంది.

మనమనస్సులనేకాదు, అలనాటివారి మనసుల్ని ఈప్రశ్న వేధించింది.

కనుకనే, రాజసూయంతో యావత్సామ్రాజ్యానికీ మహారాజ్ఞి అయిన ద్రౌపదీదేవికి కురుసభలో దారుణావమానం జరుగుతూఉంటే ఒక్కడులేచి వారించలేదు.

ఆవిడ, తాను ధర్మవిజితనా? అధర్మవిజితనా? అని అడిగినదానికి సమాధానం లేకపోగా,

"నేను రజస్వలను, ముట్టకుండు మేకవస్త్రనయియున్నదాన మఱి గురుబంధుజనాధిష్ఠితంబైనసభకు నెట్లురానేర్తు" అని మొత్తుకుంటున్నా వినకుండా దుశ్శాసనుడు పాశవికంగా ఆమెను ఈడ్చుకు[illegible] వచ్చాడు సభలోకి.

# 18

వికర్ణుడులేచి, తోచినవిధంగా ఏదోధర్మనిర్ణయంచేయ బోతే, కర్ణుడు కల్పించుకొని -

"స్త్రీకి ధర్మవిహితుడైనభర్త ఒక్కడే ఉంటాడు. ఈమె అనేకభర్తృక. కనుక, ఇలాంటిదాన్ని వివస్త్రనుచేసి తెచ్చినా ధర్మవిరోధంలేదు" అని ఆరోపించాడు.

అయితే, అతనిమాటపట్టుకుని, అన్నగారి అనుజ్ఞతో దుశ్శాసనుడు ఎంతగా ప్రయత్నించీ ఆమెను వివస్త్రను చేయ లేకపోయాడు. ఒలిచినబట్ట ఒలుస్తూండగానే మొలిచేబట్ట మొలుచుకువస్తోంది. కొండంత గుట్ట అయ్యిందికానీ కర్ణునిమాట మాత్రం చెల్లుబాటుకాలేదు, అప్పటికీ బుద్ధిరాకపోగా ఆమూర్ఖులు మళ్ళీ విజృంభించారు.

కర్ణుడు, "అయిదుగురికంటె ఒక్కభర్త ఉండటంమంచిది. జూదంలో భార్యను ఓటుపడనివానిగా తగినభర్తను ఇప్పటికైనా పొందు" అంటూ వేళాకోళంచేశాడు.

తనకంటె తగినవాడెవడన్నట్లుగా తొడమీదికి రమ్మన్నాడు దుర్యోధనుడు.

నిండోలగంలో కర్ణుడు మాటలతోను, కౌరవులు చేతల తోను ద్రౌపదిని ఇలా అవమానిస్తూంటే, వింటూకూడా, వినని వానిలా మిన్నకుండిపోయాడు ధృతరాష్ట్రుడు.

కానీ, ధృతరాష్ట్రుని అగ్నిహోత్రాయతనంలో నక్కలు అరిచాయి; అగ్నులు ఆరిపోయాయి. కౌరవస్త్రీల హృదయాలు తెలియని దుఃఖానికి తీవ్రంగాలోనయ్యాయి. దుర్యోధనాదుల శయ్యాగారాల్లో కాకులూ, గుడ్లగూబలూ కూశాయి. మహోత్పాతమేదో విరుచుకు పడబోతోందని తల్లడిల్లి పోయారందరూ. గాంధారి గగ్గోలుపడి, భర్తకు అన్నీ వివరించింది. తక్షణం ధృతరాష్ట్రుడు కొడుకుని పిలిపించి,

*"పరమపతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతిమానవభామినిఁ గాఁదలంచి దె
ప్పరములు వల్కఁగాఁదగునె? బాల్యమునాదిగ దుష్టభావనం
బెరిగితి నీనిమిత్తమునఁ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్,"*

"'వారివలన నీదురాగ్రహంబుడుగు'" మని మందలించాడు.

ప్రాణాలమీదికి వచ్చేసరికి పాండవులధర్మపరతా, ద్రౌపది పాతివ్రత్యమూ తెలిసివచ్చాయి ఆమహారాజుకు.

ఏసభలో ఆమె 'బంధకి' అని ఆరోపించబడిందో, ఆసభలోనే మహారాజైన ధృతరాష్ట్రునిచే ఆమె 'పరమపతివ్రత' అనీ, 'తపస్విని' అనీ, 'పాండవధర్మపత్ని' అనీ చాటిచెప్పబడటం విశేషం. కౌరవపక్షం వారెవ్వరూ ఆతర్వాత ద్రౌపదివిషయమై నోరెత్తలేదు. కర్ణుడు కూడా తానామెవిషయమై పొరపడ్డానని గ్రహించి పశ్చాత్తాపపడ్డాడు రాయబారానికి వచ్చిన శ్రీకృష్ణుని సమక్షంలో.

ఇదీ ద్రౌపదిపాతివ్రత్యాన్ని పరీక్షపెట్టి ప్రస్మాహాత్మ్యాన్ని కర్ణాసులు ప్రత్యక్షంగా తెలిసికొన్న తీరు!

ఇంక, మనవిషయానికివస్తే, భారతంలోనే అనుశాసనిక పర్వంలో భీష్ముడు ధర్మజునితో —

*"పాతివ్రత్యము గలిగిన*
*నాతియనఁగ దైవమనంగ జనస్తుత! వేఱె?*
*యాతత ధర్మార్థసుఖ*
*ఖ్యాతులు సద్భార్యవలనఁగాదే కలుగున్!"*

అంటూ పతివ్రత సాక్షాత్ దైవమని పలికాడు. ఈదైవత్వం పతివ్రతలకు ఎలాసిద్ధిస్తుందో అరణ్యపర్వంలో ధర్మరాజు కొంత వివరించాడు.

'ఇంద్రియాలను మనస్సులోకి, మనస్సును అహంకారంలోకి యోగించి, భక్తితో నిరంతరం ధర్మసేవాపరాయణురాలై ఉండే స్త్రీ లోకంలో అందరికంటె శ్రేష్ఠమైనది. అలాంటివారే పతివ్రత లనబడతారు. వారి నడవడికలు ఎన్నో ధర్మసూక్ష్మలతో కూడి, సామాన్యులకు అంతుబట్టని రీతిలో ఉంటాయి.' అని ఆమాటలసారాంశము.

మార్కండేయ మహర్షి ధర్మజునికి ఒక పతివ్రత కథ వినిపించాడు. ఆమె ఒక బ్రహ్మచారిని ధర్మవ్యాధునివద్దకు పంపి ధర్మబోధ చేయిస్తుంది. ఆకథలోని పతివ్రత—

*పతియె చూవె నాపాలికిఁ బరమదైవ*
*మేను వాఙ్మనః క్రియలఁ దద్భక్తి మెపుడుఁ*
*గోరి యొనరింతు దీనమిగులఁగ నొంతు*
*ధర్మవృలు గానవెందును దలఁచి చూచి"*

అంటుంది. పతినే దైవంగా త్రికరణశుద్ధితో సేవించడం పతివ్రతా ధర్మం. అదొకయోగసాధన. ఆసాధనవల్ల స్త్రీకి దైవత్వం ప్రాప్తిస్తోంది అనే విషయం ఇక్కడ స్పష్టంచేయబడింది.

దైవానికి సంబంధించి సమగ్రమైన అవగాహన లోకంలో ఏకొద్దిమందికోగాని ఉండదు. ఎక్కువమందికి ఏవోకొన్ని భావనలు (Concepts) ఉంటాయి. ఆభావనలనే ఎవరికివారు దైవంగా ఆరాధిస్తూ ఉంటారు. అలాఆరాధించుకొంటూ పోగాపోగా ఆభావనలు విశాలతరమవ్వడం, చివరికి ఒకానొకస్థితిలో దైవంఅంటే 'విశ్వప్రజ్ఞ' అనే విషయం అనుభూతమవ్వడం జరుగుతుంది. ఆఅనుభూతి నిలిచిఉన్నంతకాలమూ ఆవ్యక్తి దైవత్వస్థితిలో ఉన్నట్లే! బండరాయిని దైవంగాభావించి తరించిన మహాభక్తులు ఎందరు లేరు ? వారిని తరింపజేసింది వారిభక్తిగాని బండరాయి కాదుగదా !

స్త్రీలుగా జన్మించినవారిలో తాము స్త్రీలమనేభావన–పత్నీత్వం-బలంగా లోలోతుల పాఁ పోయి ఉంటుంది. పురుషులుగా జన్మిఁ ంచినవారిలో తాము పుఁ షమనేభావన-పతిత్వం-పాతుకుపోయి ఉంటుంది. పురు రుషుడు స్త్రీని ఈకారణం

గానే అపేక్షిస్తూఉంటారు. ఏతత్పరితృప్తికోసం జరిగిన బాహిర మైన ఏర్పాటే భార్యాభర్తల బంధం.

స్త్రీ తనలోని పత్నీత్వభావపరితృప్తికోసం పురుషుని చేపట్టడమేకాక, అతనినే దైవంగా గ్రహించి, సేవించడం చాల గొప్పవిషయం. నిర్జీవప్రతిమను ఆరాధించిన భక్తులు తరించగా లేనిది సజీవమూర్తిని ఆరాధించిన స్త్రీలు తరించడంలో ఆశ్చర్య మేముంటుంది?

ఏదో ఒకదేవుణ్ణి పతిగా భావించి, సేవించి తరించినస్త్రీలను మనం ఎరుగుదుం. ఆపద్ధతిని మధురభక్తి అంటాం. అలాకాక పతినే దేవుడిగా భావించి తరించడంగురించి మనం ఇప్పుడు ప్రస్తావించుకొంటున్నాం. దీన్ని పాతివ్రత్యం అంటారని ధర్మ జుని మాటలు తెలుపుతున్నాయి.

భక్తితో, త్రికరణశుద్ధిగా భర్తను దైవంగా ఆరాధించిన స్త్రీకి తక్కినసాధకులవలెనే 'విశ్వప్రజ్ఞ' తో అనుసంధానం ఏర్పడుతుంది! మార్కండేయమహర్షి వినిపించిన పతివ్రత వృత్తాంతమే ఇందుకు నిదర్శనం. ఆకథలోని బ్రాహ్మణస్త్రీ భర్తృసేవాపరాయణురాలై, దివ్యజ్ఞానాన్ని పొంది, కౌశికుడనే కేవలస్వాధ్యాయపరుడైన బ్రాహ్మణబ్రహ్మచారిని తరింప జేసింది.

ఒక్క భర్తను దైవంగా భావించి, దీక్షతో సేవించినస్త్రీ దివ్యజ్ఞానసంపన్నురాలై, పరమ పతివ్రత అవుతుండగా, అయిదుగురు భర్తలను అదేవిధంగా సేవించిన ద్రౌపదీదేవి అయిదురెట్లు పరమపతివ్రత అయిఉంటుందనుకోవడం సబబు. కానీ మన కిక్కడ కొరుకుడుపడని విషయం లోకంలో ఒకస్త్రీకి ఒకభర్త ఉంటుండగా ద్రౌపదికి అయిదుగురు భర్తలు ఉండటమేమిటి? పంచభర్తృక అయ్యీ, ఆమె పతివ్రత ఏలాకాగలిగింది?అన్నది.

ద్రౌపదీపాండవులది అసాధారణమైన వివాహమేకాని ఆచారవిరుద్ధమైన వివాహంమాత్రంకాదు. తొల్లిటి మహాత్ములలో అలాంటి వివాహాలు చేసికొన్నవారు చాలామంది ఉన్నారని ధర్మరాజూ, వ్యాసమహర్షి ద్రుపదునికి వివరించారు. ఈఅసాధారణవివాహంమాత్రం ఎలాచెల్లుబాటవుతుంది? అంటే, ద్రౌపదీ పాండవులు అసాధారణమైన దివ్యమూర్తులు గనుక !

వివాహాలు విధినిర్ణీతాలు అనేది మనఅనుభవాలనుంచి మనం నేర్చుకున్న పాఠం. ద్రౌపదీవివాహం కూడా అంతే. ఆమె పూర్వజన్మగాథలు ఈవిషయాన్ని నిరూపిస్తున్నాయి. ఒక జన్మలో మౌద్గల్యుడనే మహర్షికి నాలాయని అనేపేరుతో భార్యగా ఉండి, భర్త రోగిష్టివాడైనాసరే, అసహ్యించుకోకుండా భక్తితో సేవించింది. ఆమహర్షి తపఃప్రభావంతో వారిద్దరూ ఎన్నోవేల సంవత్సరాలు వివిధలోకాల్లో దంపతులుగా చరించారు, అయినప్పటికీ ఆమెలోని పత్నీత్వప్రజ్ఞకు పత్యాకాంక్ష తీరలేదు. కాశీ

రాజుకు కుమార్తెగా పుట్టి అప్పుడా ప్రజ్ఞ 'పశుపతి' నాశ్రయించింది. పశుపతి ఆమె తపస్సుకు ప్రసన్నుడై, ఆమెలోని పత్యాకాంక్ష తీవ్రతకు తగినట్లుగా పరివాతిజన్మలో పంచపతులను అనుగ్రహించాడు. వారే పాండవులు, ఆ ప్రజ్ఞే ద్రౌపది. ఈగాథలను అవసరార్థం ప్రకటించినవాడు వ్యాసభగవానుడు.

ఆచారంనుంచి ధర్మం ప్రభవిస్తుంది. ఆధర్మానికి ప్రభువు అచ్యుతుడు- "ఆచార ప్రభవోధర్మః ధర్మస్య ప్రభురచ్యుతః—" అని ధర్మవిదుడైన భీష్ముడు విష్ణుసహస్రనామ స్తోత్రంలో నిర్దేశించాడు.

ద్రౌపదీవివాహంలో ఆచారవిరోధం లేదని చూశాం. అది విధి నిర్దేశమనీ తెలుసుకున్నాం. ధర్మానికి మూలమైన దైవం కూడా ఆమెకు అయిదుగురు పతులుండటంలో ధర్మవిరోధం ఉండదని వరం ఇచ్చాడు. కనుక ద్రౌపదీవివాహం ధర్మసమ్మతం!

పాండవులయిదుగురూ పంచేంద్రుల అవతారాలు. వేద సంప్రదాయం ప్రకారం ఇంద్రాదిదేవతలూ, జీవుడూ పరుని శక్తిస్వరూపాలు. కనుకనే రుద్రుని 'పశుపతి' అనికూడా అంటారు. "నమోఽస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే--' అన్నప్పుడు సహస్రాక్షుడంటే ఇంద్రుడు. కాబట్టి రుద్రుడు తన ఇంద్రాది శక్తుల్ని జగత్కల్యాణార్థం జీవప్రజ్ఞలుగా (పాండవులుగా) మేల్కొల్పడం ఈకథలోని పరమార్థం.

ద్రౌపది మహిమకలదే అయితే కురుసభతో కేశాకర్షణ, సైంధవుడపహరింపబోవడం, కీచకునిచే అవమానింపబడటం ఎలా సాధ్యపడ్డాయి ?- అనేది విచారణీయం. సంస్కృతభారతంలో సభాపర్వంలో ద్రౌపదీమహత్వాన్ని గూర్చి ధృతరాష్ట్రుడు సంజయునితో —

"సంజయా! ద్రౌపది కన్నెత్తి చూసినంతమాత్రంచేతనే ఈజగత్తునంతటినీ సర్వనాశనం చేయగలదు. ఒక్కశాపవాక్యాన నన్ను నాబిడ్డలనూ దహించివేయగలదు. కానీ ఆమె దయాహృదయంతో సహించింది." అంటాడు.

నిజమే, ఆమె సహించింది కనుకనే అవి చెల్లుబాటయ్యాయి.
అవి చెల్లుబాటయ్యాయి కనుకనే కథ నడిచింది.
కథనడిచింది కనుకనే శ్రీకృష్ణుని ధర్మసంస్థాపన ప్రణాళిక నెరవేరింది,

ఈదృష్ట్యా చూసినప్పుడు ద్రౌపదిది లోకోత్తరమూ, మహామహిమాన్వితమూ అయిన పాతివ్రత్యం. సావిత్రి, దమయంతీ మొదలైనవారి పాతివ్రత్యం వ్యక్తిగత కక్ష్యలకు పరిమితంకాగా ద్రౌపది పాతివ్రత్యం విశ్వప్రణాళికకు విస్తరించింది.

సైంధవునితో సంభాషిస్తూ ద్రౌపది చెప్పినమాటలు చూడండి-

"ననుఁబెఱవనితల చందం
బున నవమానింపనీకుఁబోలదు మత్పా
వన పాతివ్రత్యమహిమ
ననిశము నేకీడు నెందు నొందదు నన్నున్"

అదీ ఆమె ఆత్మప్రత్యయం !

"భారతం-ధర్మాద్వైతం" అనే సిద్ధాంతవ్యాసగ్రంథంలో చెప్పబడినట్లుగా "సముద్రం మనం తీసుకువెళ్ళిన పాత్రలో పట్టకపోవడం సముద్రం తప్పుకాదు. అలాగే, మానవులు ఎరిగిననియమాల్లో ఇమడలేకపోవడం ద్రౌపదిలాంటి కారణజన్మ ఎత్తినవారికి దోషం కానేరదు!"



(ద్రౌపదీమాతకు సంబంధించిన వివరాలు' విశేషాలకు నాసిద్ధాంతవ్యాసం "ఆంధ్రమహాభారతమూ-ద్రౌపది ఒక ఐతిహాసిక విశ్లేషణ" చూడవచ్చు.)

# 4. మొల్లదికాని రామాయణం-1

## అవతారికా నిరాకరణము

మొల్ల రామాయణంగా వ్యవహరింపబడుతున్న సంగ్రహాంధ్ర రామాయణం మొల్ల అనే కవయిత్రిదే అనడానికి ముఖ్యాధారం ఆ గ్రంథంలోని అవతారిక. సూక్ష్మంగా విశ్లేషించి చూస్తే, ఈఅవతారిక అంత ప్రామాణికమైనదిగా కనబడదు.

ఇందుకు మొదటికారణం ఇరవై నాలుగుపద్యాల ఈఅవతారిక సమగ్రంకాదు.

దశరూపకాలలో ఒకటైన నాటకానికి నాంది, ప్రస్తావనల వల్ల ఏప్రయోజనాలు నెరవేరుతాయో అవేప్రయోజనాలు అవతారికలవల్ల కావ్యాలకు నెరవేరవలసిఉంది. ఇష్టదేవతా స్తుతిరూపకమైన మంగళారంభం, అందులోనే కావ్యవస్తు సూచన, ఇతర దేవతాసంప్రార్థన, గురుస్మరణ, ఆత్మనివేదన, పూర్వకవి నమస్కారం, కుకవినింద, కావ్యరచనాప్రస్తావన, కృతిపతివంశ వర్ణన, అనువాదకావ్యమైతే మూలగ్రంథ - కవి వివరాలు, అనువాద ప్రణాళిక, షష్ఠ్యంతాలు-అనేవి ఒక క్రమంలోఉండటం అవతారికా సంప్రదాయం.

అవతారికలవల్ల కావ్యరచనా సముద్దేశం పాఠకులకు బోధపడుతుంది. కథావస్తు పరిచయంవల్ల పాఠకుల్లో కావ్య

రసాస్వాదనకు సహాయత్తత కలుగుతుంది. కృతికర్త, కృతిభర్తల వంశవర్ణనలవల్ల కొంత చారిత్రకనేపథ్యం సమకూరి, పాఠకుల్లో ఉత్సుకత కలుగుతుంది.

చర్చనీయాంశమైన రామాయణావతారికలో ఆదికవి వాల్మీకి స్తుతికాని, సంస్కృత రామాయణ ప్రస్తావనకాని ఎక్కడా లేవు. తొమ్మిదవపద్యంలో సంస్కృతాంధ్ర కవులు కొందరు నుతింపబడ్డారు. వారిలో ప్రథమంగా 'సురసన్నుతజ్ఞాను సువివేకి వాల్మీకి' పేర్కొనబడ్డాడు. అంతమాత్రమే.

మొల్ల అనబడే తనకు కావ్యరచనకు అవసరమైన పాండిత్యంలేదని, శ్రీకంఠమల్లేశువరముచేత కవిత్వం చెప్పటం నేర్చుకున్నానని, రాముడు తనచే కావ్యరచన చేయిస్తున్నాడని చెప్పుకుని, 'ఈపుణ్యచరిత్ర' ఇహపరసాధనము కనుక కవులను తప్పులెంచవద్దని కవయిత్రి కోరింది. (అవతారిక 11, 12, 13 పద్యాలు). ఏపుణ్యచరిత్రో చెప్పకపోవడాన్నిబట్టి ఈపద్యాలు మొల్లవికావని, లోకంలో ప్రచారంలోఉన్న ఈగ్రంథాన్ని మొల్లకు అంటగట్టి ప్రామాణికతను, ప్రాచుర్యాన్ని కలిగింపచేయటంకోసం ఎవరో అనంతరకాలంలో కల్పించిఉంటారని బోధపడుతోంది.

అవతారికలో 14, 19 సంఖ్యగలవి "అనిమతియుసు" అనేరెండు చిన్నవచనాలు. ఈరెంటికి నడుమ పొసగని కవితా

సిద్ధాంతాలు గల సాయిసుపద్యాలున్నాయి. అతరువాత అయిదు పద్యాల్లో రామాయణరచన సమర్థింపబడింది. ఈ అయిదు పద్యాలు 13వపద్యం వెంటనే ఉండిఉంటే కొంత ఔచిత్య వంతంగా ఉండేది.

రాముడు గొప్పవాడు కనుక ఆయనచరిత్రను చెబుతున్నట్లుగా ఉన్నదేకాని ఈఅవతారికలో ఎక్కడా రాముడు కృతి భర్తగా కనిపించడు. షష్ట్యంతపద్యాలు లేనేలేవు. కావ్య రచనకు ప్రేరణ ఏమిటో చెప్పబడలేదు. కనుక ఈ అవతారిక సమగ్రం కాదు.

ఇంక రెండవ కారణం ఈ అవతారికలోని <u>అసంగతాలు, అపకతపకలు ను.</u>

మొదటిపద్యంలో శ్రీరాముడు <u>భక్తతతిని ప్రోచు</u> ననే ఆశం సనందుంది, రెండవపద్యంలో 'మల్లికార్జునుడు మాకు శుభంబు లొప్పుగనిడు' ననే ఆకాంక్ష ఉంది. మూడవపద్యంలో కృష్ణుడు (ఎవరినో?) 'ప్రోచుగాపుతస్' అనే ప్రార్థన ఉంది. నాల్గవ పద్యంలో బ్రహ్మ (ఎవరికో?) అయుష్షు, ఈప్సితార్థములు ఇవ్వాలనిఉంది. తరువాతిపద్యం విఘ్నరాజస్తుతి. 'వాక్ప్రాప్తికై' గణపతిని <u>ప్రస్తుతింతు</u> నని అపద్యంలో చెప్పబడింది. ఎమెస్కో వారి ప్రతిలోని పాఠాంతరం "...వాక్ప్రాప్తి సేవించి ప్రస్తుతింతు" అనేది. కావ్యక్రమములేవీ తనకు తెలియవని (12వ

పద్యంలో) చెప్పబోతూ వాక్ప్రౌఢిరై/వాక్ప్రౌఢితో వినాయకుని ప్రస్తుతించటం విరుద్ధంగా కనిపిస్తుంది.

ఆరవపద్యం పార్వతిని, ఏడవపద్యం లక్ష్మీదేవిని, ఎనిమిదవపద్యం సరస్వతిని ఉద్దేశించినవి. బిడ్డల 'వికారపుఁ జేఁతల'కు ఆనందించే జగన్మాత 'శుభంబులీపుతన్' అనిమాత్రమే ఉండగా, "...మాకాముని తల్లి సంపద నఖండముగా నిడు మాకు నెప్పుడున్" అని, "...విద్యాలయవాణి శబ్దముల నర్థములన్ సతతంబు మాకీడున్" అని తర్వాతిపద్యాల్లో ఉండటం గమనార్హం. 'మాకు' అనే గౌరవబహువచనం స్త్రీలు వాడుకోకూడదని కాదుగానీ సర్వత్రా ఆ 'రాజసం' లేదనిమాత్రమే నా సూచన.

పూర్వకవిస్తుతిగా పేర్కొనబడే తొమ్మిదవపద్యం తెలుగు సాహిత్యంతో ఏమాత్రం పరిచయంలేని వారెవరో వ్రాసినదిగా అనిపిస్తుంది. ఎనమండుగురు తెలుగుకవులను ఒక క్రమం లేకుండా, తగిన విశేషణాలు లేకుండా ఒక ఎత్తుగీతిలో ఏతెలుగు కవీ 'ఎత్తివేయడు'. ద్విపదరామాయణకర్త రంగనాథుని పేర్కొని పద్యరామాయణకర్త లెవ్వరినీ స్మరింపకపోవటం అనుచితం అనిపిస్తుంది.

*"రాజితకీర్తియైన రఘురామ చరిత్రము మున్ గవీశ్వరుల్*
*తేజమెలర్పఁ జెప్పిరని తెల్సియు " (21వ పద్యం)*

పేర్కొనకుండా ఉండటం ఎలాసాధ్యమయిందో! ప్రసిద్ధులైన కవు లెవ్వరూ పేర్కొనని 'భోజుడు' ప్రస్తావింపబడటం ఆశ్చర్య

మనిపిస్తుంది. (ఎమెస్కో ప్రతి పాఠభేదం-'భోజనుతించిమించి') నన్నయను 'నవ్యమంజులవాగ్ధుర్యు' డనటం వింతగా ఉంది. గురులింగ జంగమార్చనవినోద, నిత్యశైవాచారసంపన్నగా కాండాంత గద్యలలో పేర్కొనబడిన మొల్ల ఈశ్వరార్చన కళాశీలుడైన శ్రీనాథుని 'రసికుడు'గా ప్రస్తావించడం అసంగతంగా ఉంది.

పదవ పద్యంలో ''తొల్లిటి యిప్పటి సత్కవి వల్లభులు' స్మరింపబడ్డారు. తొమ్మిదవ పద్యానికి ఈపద్యం కొనసాగింపు. 'రసికవినుత వాగ్వైభవకళామల్లులు - కవితారచనల బల్లిదులు - సత్కవివల్లభులు' అనే పదాలు పునరుక్తులు. ఈ పునరుక్తికి ఔచిత్యంలేదు. 'ఘనులు' అనే పదానికివి విశేషణాలు.

పదకొండవ పద్యంలో మొల్ల ప్రత్యక్షమవుతుంది.

*"గురులింగ జంగమార్చన*
*పరుఁడును, శివభక్తరతుఁడు, బాంధవహితుఁడున్*
*గురుఁడాతుకూరి కేసయ*
*వరపుత్రిని మొల్లయనఁగ వఱలినదానన్"*

'కేసయ' ఈమెకు గురుడు, ఈమె ఆయనకువరపుత్రి. వీరిద్దరూ వీరశైవసంప్రదాయానికి చెందినవారు. కేసయవల్ల దీక్షను పొందిన ఈమె పుత్రికగా పరిగణింపబడినది, కేసయ ఈమెకు కన్నతండ్రికూడా అయిఉంటే, అతనివంశక్రమాన్ని వర్ణింపకుండాను, తల్లిని పేర్కొనకుండాను ఉండదు. కాండాంతగద్యతో

ఈపద్యాన్ని పోల్చిచూస్తే విషయభేదాన్నిబట్టి పద్యకర్తృత్వాన్ని శంకించవలసివస్తోంది. గద్యలో కేసయ, 'కేసనసెట్టి' గా మారాడు. మొల్ల వరపుత్త్రికగకాక 'తనయ'గా మారింది. తండ్రి గురులింగజంగమార్చనపరత్వం, తనయకు గురులింగజంగమార్చన వినోదంగా మారింది. అతని శివభక్తి గద్యలో ఈమెను నిత్యశైవాచార సంపన్నను చేసింది. పద్యంలో వరపుత్త్రిని అని మాత్రమే ఉండగా గద్యలో శ్రీగౌరీశ్వర వరప్రసాదలబ్ధ అని చెప్పబడింది. గద్యలోని సూరిజనవినుత, కవితాచమత్కార — అనేవిశేషణాలు అవతారికలోని 12, 13 పద్యాలభావానికి విరుద్ధంగా ఉన్నాయి. కనుక మొల్లసుగూర్చిన అవతారికలోని ఈ పద్యం, కాండల చివరగల గద్యము కల్పితాలు.

పన్నెండవ పద్యం అసంబద్ధమైన విషయాలతో నిండి ఉంది. తనకు కవిత్వం చెప్పటం తప్ప కవిత్వానికి కావలసిన వేవీ తెలియవుట - 'విఖ్యాత గోపవరపు శ్రీకంఠమల్లేశు వరము చేత' కవిత్వం చెప్పటం నేర్చుకున్నదట. దేశీయ పదాలు, తెనుఁగులు, సాంస్కృతులు, సంధులు, ప్రాజ్ఞులశబ్దవితతి ... అర్థములు, భావార్థములు, కావ్యపరిపాకములు, రసభావచమత్కృతులు, పలుకుసరవి, బహువర్ణములు, విభక్తులు, ధాతులు, అలంకృతి, ఛందము, కావ్యసంపద, క్రియలు, నిఘంటువులు... ఈమాటలకు పొందిక కనపడదు. అధిక్షేపణతోకూడిన కవితా సిద్ధాంతాలు ప్రతిపాదించడం, 'సూరిజనవినుతకవితాచమత్కార' నని చెప్పుకోవటం ఈపద్యంలోని వినయానికి విరుద్ధంగా ఉంది.

తరువాతి పద్యం

> "చెప్పుమని రామచంద్రుఁడు
> సెప్పించిన పలుకుమీఁదఁ జెప్పెద నేనా
> ల్లప్పుడు నిహపరసాధన
> మిప్పుణ్యచరిత్ర తప్పులెంచకుఁడు కవుల్"

అనేది. చెప్పుమని రామచంద్రుడు ఎవరితో చెప్పించాడో తెలియదు. ఆపలుకుమీద ఎల్లప్పుడూ ఈపుణ్యచరిత్రను చెబుతాననటం వింతగాఉంది. కేవుడు కవితాసామర్థ్యాన్ని ప్రసాదించడం, రాముడు చెప్పించడం - అయినా కవితాక్రమం తెలియదు, తప్పులుఎంచవద్దనడంలో మొల్ల ఆత్మీయత ఏమాత్రం పరిమళించడంలేదు.

## అసంగతమైన కవితాదర్శాలు :

అస్థానపతితంగా నాలుగుపద్యాల్లో ప్రతిపాదింపబడిన కవిత్వాదర్శాలను విమర్శకులు మహత్తరమైనవిగా పరిగణిస్తూ ఉంటారు. కానీ అవి చాలావరకు అసందర్భాలు, అసంగతాలూను. ఆ ఆదర్శాలకు కావ్యానికి పొంతనలేదు. ఏకావ్యంలోవో పద్యాలు వచ్చి యిక్కడ పడినట్లున్నాయి. ఆపద్యాలు –

> "వలిపపుసన్నపయ్యెదను వాసిగ గందపుఁబూఁత తోడుతన్
> గొలఁదిగఁ గానవచ్చు వలిగుబ్బచనుంగవ రీవినొప్పఁగాఁ
> దెలుఁగని చెప్పుచోటఁగడు తేటల మాటలఁ గ్రొత్తరీతులం
> బొలుపు వహింపకున్నమఱి పొందగునే పటుహాదిశబ్దముల్ -15

"మును సంస్కృతములఁ దేటగఁ
దెనిఁగించెడిచోట నేమిదెలియకయుండన్
దనవిద్యమెఱయఁ గ్రమ్మఱ
ఘనమగు సంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే 16

"తేనేసోఁక నోరుతీయనయగురీతి
తోడనర్థమెల్లఁదోఁచకుండ
గూఢశబ్దములను గూర్చినకావ్యమ్ము
మూఁగ చెవిటివారిముచ్చటగును. 17

"కందువ మాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్పునది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మఱి కానుపించు విబుధులమదికిన్." 18

పటహము మొదలైన వాద్యపరికరాలు ఉత్తినేధ్వనిచేస్తాయితప్ప అర్థాన్నివ్వవు. అలా ఆడంబరంగా ధ్వనించే శబ్దాలు పనికిరావు, తెలుగుకవిత్వం తేటమాటల్లో ఉండాలి అనేది ఇక్కడ కవి హృదయం. అయితే, జిలుగుపయ్యెదమాటునుండి కొద్దిగా కనపడుతూఉండే 'వలిగుబ్బచనుంగవకీవి' నొప్పవలసింది అర్థం కాని శబ్దాలుకావు. రామరాజభూషణుడు తన 'కావ్యాలంకార సంగ్రహము' ద్వితీయాశ్వాసములో కావ్యంలో ధ్వని 'వనితా కుచకుంభముగతి' గూఢంగా ఉంటేనే పైదగ్ధ్యము కలిగి,ఉత్తమ కావ్యమవుతుందని, లేకుంటే మధ్యమకావ్యమవుతుందని (148వ పద్యం) చెప్పాడు. ఆరుద్ర ప్రస్తావించిన "ఘనతర ఘూర్జరీకుచ యుగకిర్రియ గూఢముగాక..." అనే ఆంధ్రపంచతంత్రి పద్యా

నికీ, ఈరామాయణంలోని ప్రస్తుతపద్యానికీ, రామరాజభూష ణుని పద్యానికీ మూలమనదగిన శ్లోకం సంస్కృతభాషలోని అలం కారికగ్రంథాల్లో ఉండి ఉంటుంది. ప్రస్తుతపద్యంలో శబ్ద ప్రయోగం గురించి చెబుతూ ధ్వని ప్రసక్తి తీసుకురావడంలో ఔచిత్యం కనపడదు.

సంస్కృతాన్ని తేటగా తెనిగించేటప్పుడు పాండిత్యాన్ని ప్రదర్శిస్తూ మళ్ళీ సంస్కృతాన్నే వాడటం సమంజసం కాదు- అని 16వ పద్యభావం. ఈరామాయణం అనువాదం కానప్పుడు అనువాదప్రసక్తి అప్రస్తుతం. ఈకావ్యంలోనే సంస్కృత భూయిష్ఠంగా చెప్పిన పద్యాలు ఎన్నోఉన్నాయి. కథాప్రారంభం లోనే అయోధ్యాపురవర్ణనమంతా సంస్కృతసమాసాల్లోసాగింది.

ఝటితిస్ఫూర్తిలేని గూఢశబ్దమయకావ్యం మూగ చెవిటి వారి ముచ్చటవంటిదని 17వ పద్యంలో ప్రతిపాదించబడింది.

కంమ్మని మాటలు, సామెతలు అందంగాకూర్చిన కవిత్వం తెనుగునకు తగినదిగా, వీనుల విందుగా పండితుల మనస్సులకు కనిపిస్తుందని 18వ పద్యంలో చెప్పబడింది.

కవితాక్రియమములేవియునెఱుంగని, ముక్తిభక్తిమాత్రమే ప్రధానం, చమత్కృతి కాదని భావించేవ్యక్తి ఇటువంటి ఆదర్శాలను ప్రకటించటం నమ్మశక్యంకాదు. ఎవరోకవి, ఏదోసందర్భంలో చెప్పిన పద్యాలు ఇక్కడ చేర్చబడిఉంటాయి.

## రాముడు కృతిభర్తయా ?

పోతనగారివలె మొల్ల కూడా తనరామాయణాన్ని శ్రీరామ చంద్రునికి అంకితంచేసి ధన్యురాలయినదని ఈకావ్య విమర్శకు లందరూ చెప్పారు. కాని అవతారికలో అంకితప్రసక్తి ఎక్కడా లేదు. షష్ఠ్యంతపద్యాలు లేకపోవడం సంగతి అలా ఉంచుదాం. 20, 21, 22, 23, 24 పద్యాల్లో కావ్యరచనకు రామకథనే ఎంచుకోవడాన్ని సమర్థించుకోవడం కనిపిస్తుంది కాని రాముడు కృతిపతి అని చెప్పబడలేదు. "సల్లలితప్రతాపగుణసాగరుఁడై ...నేయునే" అనే 24వ పద్యంలో కూడా రామరసాయన సేవ నానికి అలవాటు పడిన జిహ్వ ఇతరరుచులను కోరదు, కనుక, పిల్లరరాజుల కథలకంటె, గుణవంతుడు, బలవంతుడు అయిన రామునికథను వర్ణిస్తాను అనిమాత్రమే చెప్పబడింది. కనుక, ఈఅవతారికనుబట్టి రాముడు కథానాయకుడేగాని కృతిపతికాడు. కావ్యంలో కాండాది, కాండాంతపద్యాలు ఈకావ్యం రామాంకిత మన్న భ్రమను కల్పిస్తున్నాయి. ఈసంగతి తరువాత ముచ్చ టించుకుందాం.

## ఇంతకీ కావ్యం పేరు ఏమిటి?

ఈఅవతారిక మొల్ల అనే కవయిత్రి వ్రాసినది కాదనటా నికి మరొక ఆధారం 25వ వచనంలో పేర్కొనబడిన గ్రంథ నామం.

"అనివితర్కించి మొదలను నిష్టదేవతాప్రార్థనంబును బురాతన కవీంద్ర స్తుతియునుం జేసి నాచేయంబూనిన మొల్ల రామాయణమునకుఁ గథావిధానం బెట్టులనిన"

మొల్ల రచించిన రామాయణం ఇతరులచే మొల్లరామాయణంగా పేర్కొనబడుతుంది. కాని, మొల్ల స్వయంగా తనది మొల్ల రామాయణమని చెప్పుకోదు. ఈవచనాన్ని బట్టి అవతారిక మొల్లది కాదని స్పష్టమవుతోంది.

కొండపల్లి వీరవెంకయ్యగారు 1927 లో ప్రచురించిన "మొల్ల రామాయణము" లో అవతారిక ప్రత్యేకంగా లేదు. ఈ ఇరవై నాలుగు పద్యాలు బాలకాండకు ప్రారంభంగా మాత్రమే ఉన్నాయి. కనుక, అవతారిక, పీఠిక అనే శీర్షికలు పరిష్కర్తలో, ముద్రాపకులో చేర్చినవేకాని వ్రాతప్రతుల్లో ఉండిఉండవు. ఈ కావ్యానికి ఇష్టదేవతా ప్రార్థన, పురాతనకవీంద్ర స్తుతి తర్వాత కథ మొదలుకావాలని పై వచనాన్ని బట్టి తెలుస్తోంది. కుకవి నిందా ప్రాయమైన కవిత్వాదర్శాలు అసంగతాలని దీనివల్ల కూడా తెలుతోంది.

మొత్తంమీద చూస్తే, ఈ అవతారిక అప్రామాణికమని, మొల్లది అయి ఉండదని స్పష్టమవుతోంది.



# 5. మొల్లదికాని రామాయణము - 2

## గ్రంథకర్తృత్వనిరాకరణము

కావ్యానికి అవతారిక ఒకగుర్తింపుపత్రంవంటిది. అటువంటి అవతారిక ఈ రామాయణానికీ ఉంది. కానీ, అదికాస్తా మొల్లది కాదని, కృతకమనీ తేలిపోయింది. మరింక ఈరామాయణకర్త మొల్ల అనడానికి కాండాంత గద్య మాత్రమే ఆధారం. ఆ గద్య అన్ని కాండలకు ఒకేవిధంగా మూసగో పోసినట్లుగా ఉంది. ఇంతవరకు విమర్శకులదృష్టికిరాని మరొక విశేషాన్నికూడా ఇక్కడ చెప్పుకోవలసిఉంది. ఈరామాయణం రామాంకితం అనేభ్రమను కలిగిస్తున్నవి కాండాది, కాండాంతపద్యాలు అని చెప్పుకున్నాం. కానీ కాండాంతపద్యాలంటూ ఈకావ్యానికి లేక పోవటం చాలా చిత్రం. అన్ని కాండలకు కలిపి ఒకే ఒక్క పద్యం 'కాండాంత పద్యాలు' గా భ్రమ కలిగిస్తోంది.
ఆపద్యం ఇది :—

> *"జలజాక్ష! భక్తవత్సల !*
> *జలజాసనవినుత పాదజలజాత.' సుధా*
> *జలరాశి భవ్యమందిర!*
> *జలజాకర చారుహంస! జానకినాథా !"*

ఇంక కాండాది పద్యాలు ఏడూ ఒకేమకుటంతో, కావ్యవస్తువుతో అంతగా సంబంధం లేకుండా కూర్చబడ్డాయి. బాలకాండకు

మొదట ఇటువంటి పద్యంలేదు. ఇప్పుడు మనం అవతారికగా పరిగణిస్తున్నదే బాలకాండ ప్రారంభం. "శ్రీమహిమాభి రాముడు..." అనే ప్రారంభపద్యం రామునికి సంబంధించినదే. కనుక బాలకాండ మొదటనుకూడా రామస్తుతి ఉన్నట్లే. ఆరుద్ర గారు 'నేను లభ్యమవుతున్న ప్రతులు సమగ్రమైనవి కావ'ని అభిప్రాయపడటం సరికాదు. ఒకప్రతిలో కాకపోతే ఒకప్రతిలో నైనా నారదుడు ఈకథను వాల్మీకికి చెబుతున్నట్లుగా ప్రారంభ వాక్యాలు లేవంటే కావ్యం తీరేలాంటి అనుకోవాలి. సి.పి. బ్రౌను దొరగారి వ్రాతప్రతిలో 'సరసములు, సముచితములైన యపూర్వ పాఠము లనేకములుగనృట్టినవి'ట. దానిలోకూడా శ్రీబొమ్మకంటి వారికి (ఎమెస్కో ప్రతి) ఆయదర్శగాను ఉండి ఉండాలనుకుంటున్న ప్రారంభం లేదంటే మొత్తానికే లదిలేనట్లు. ప్రారంభమే కాదు, ఈకావ్యానికి ఉపసంహారవాక్యాలుకూడా లేవు. కావ్యాం తంలో కథను ముగిస్తూ, 'నారదుడువాల్మీకికి ఈవిధంగా నీకథను వినిపించాడయ్యా రామా!' అని ఒకటి రెండు వాక్యాలైనా ఉండాలికదా!

ఇంక, కాండాదిని పరిశీలిద్దాం, అయోధ్యాకాండను మొదట

*"కందర్పరూప! ఖండిత*
*కందర్పవిరోధిచాప! కరుణాద్వీపా!*
*వందితశుభనామా! ముని*
*సందోహస్తుత్య భూమ! జానకరామా!*

"శ్రీ నారదమునీశ్వరుండు వాల్మీకి మహామునికి తెలింగిం చిన తెలుంగు వినిపించిన నారద్భుంపుము"

'జానకీరామా! నారదుడు వాల్మీకికి ఇలా చెబుతున్నాడు, విను' అని ఇక్కడ అన్వయం. ఇటువంటి అన్వయం బాల కాండకు మొదట పొసగదు. అక్కడ దైవంగా మాత్రమే రాముడు కీర్తింపబడాలి. కీర్తింపబడ్డాడు. తర్వాత ఇష్టదేవతా ప్రార్థన, పురాతన కవీంద్రస్తుతిచేసి, కథను ప్రారంభించడం జరిగింది. అయోధ్యాపురవర్ణన, దశరథుని పుత్రకామేష్టి, రామాదులజననం, శివధనుర్భంగం, సీతారాముల కళ్యాణంవరకు కథనడిస్తేకాని రాముడు జానకీరాముడుకాడు. కనుక అంతవరకు కథను బాలకాండలో నడిపి "...జానకీనాథా!" అనే పద్యంతో ముగించి, అయోధ్యాకాండను ఈపద్యంతో ప్రారంభించడం ఎంతో సబబుగా ఉంది. శివుని విల్లును ఖండించి, సీతను చేపట్టాడు. కనుక, "కందర్పరూపా!" అని, "ఖండితకందర్పవిరోధిచాపా!" అని రాముడు సంబోధింపబడటం ఔచిత్యవంతంగానే ఉంది. కానీ ఈపద్యాలన్నీ మొల్లవి అయి ఉండటానికి ఎంతమాత్రమూ కుదరదు. మొల్ల ఈకావ్యంలో శ్రీకంఠమల్లేశుని భక్తురాలిగా, గురులింగజంగమార్చనపరుడగు కేసయ వరపుత్రికగా, గురు లింగ జంగమార్చన వినోదగా, నిత్యశైవాచార సంపన్నగా పేర్కొనబడింది. ("నిత్యశైవాచారసంపన్న" అనేమాట 1927 నాటి కొండపల్లి వీరవెంకయ్యగారి ప్రతిలో మాత్రమే ఉంది. ఇతర ప్రచురణకర్తలు పరిహరించారు) అంతటి శివదీక్షాపరు రాలు శ్రీరాముని ఈవిధంగా సంబోధించి ఉండదు.

ఆరణ్యకాండకు మొదటగల పద్యం, గద్యం కూడా ఈ తీరునే ఉన్నాయి.

"మునిదత్తధనుర్వేదా!
మునినాథ ప్రియసతీసుపూజితపాదా!
జనకార్చితగుణధామా!
సనకాదిస్తవ్యనామ! జానకిరామా!"

అనేపద్యంలో సంబోధింపబడినట్లుగా ఈకావ్యంలో రాముడు మునిదత్త ధనుర్వేదుడు కాడు. దశరథుడే నలుగురు కుమారులను 'ధనుర్వేదపారగులం'గావించినాడు. (బాల-45 పద్యము) విశ్వామిత్రుడు విద్యలనిచ్చే ప్రసక్తే లేదు. మునినాథప్రియ సతులు రాముని పూజించినట్లు కూడా కావ్యంలో రాలేదు. జనకుడు కొనియాడినట్లుగా మాత్రం బాల-82 వ పద్యంలో పేర్కొనబడింది. ఇంక, సనకాదుల ప్రసక్తి కావ్యంలో ఎక్కడా రాదు, కనుక కావ్యంతో సంపడించని సంబోధనలుగల ఈపద్యం కావ్యకర్తదై ఉండదు.

కిష్కింధాకాండ కూడా,

"పక్షీంద్రవాహా! గిరిజా
ప్రత్యక్షమనోజ్ఞాతగేహ! యపహృతమోహా!
రాక్షసభీమా! మునిజన
సాక్షాత్కృత నైజధామ! జానకిరామా!"

అనేపద్యంతోను, పైమాదిరి గద్యంతోను మొదలవుతోంది. కానీ రాముడు విష్ణుమూర్తి యొక్క అవతారమనటువంటి కథాపరమైన

సమన్వయం ఈపద్యానికి కుదరదు. ఇక్కడకూడా విరక్తైశ్వ రాలయిన మొల్ల విష్ణుపారమ్యాన్ని అంగీకరిస్తోందని 'గిరిజా ప్రత్యక్షమనోజ్ఞాతగేహ' అనే సంబోధనవల్ల ఒప్పుకోవలసివస్తుంది.

ఇంక, సుందరకాండాదిపద్యాన్ని చూద్దాం –

"సూర్యకులరత్నదీపా !
సూర్యసహస్రప్రతాపా ! సుందరరూపా!
ఆర్యారాధిత నామా !
శౌర్యాధిక సుగుణసీమ ! జానకరామా!"

ఈపద్యానికి కథతో అన్వయం కుదరనిమాట అటుంచి ఔచిత్యం కూడా అంతగా పాటించబడలేదే అని బాధ కలుగుతుంది. రఘు కులాన్వయ రత్నదీపం అనడంలో ఉండే ఔచిత్యం 'సూర్యకుల రత్నదీపా' అనడంలో ఉండదు. సూర్యవంశానికి రాముడు రత్నదీపంవంటివాడనటం రాముణ్ణి తక్కువ చెయ్యటమేకాని గొప్పగాచెప్పటం కాదు. 'సూర్యసహస్రప్రతాప' అని మళ్ళీ నాల్గవపాదంలో 'శౌర్యాధిక సుగుణసీమ' అనవలసిన అవసరం కనపడదు. రామనామం ఆర్యా (పార్వతి) రాధిత మనడంలో ఔచిత్యం లేదు. 'సుందరరూపా' అనే సంబోధన యతిమైత్రిని సరిపెట్టటానికి వేసినదిగాఉంది. ఈపద్యంలోకూడా ఎక్కడా మొల్లమొహం కనిపించదు.

యుద్ధకాండ మూడాశ్వాసాలకు మూడు ప్రారంభపద్యాలు ఉన్నాయి.

1. "కామారివినుతనామా !
సామీరిస్తుత్యసుత్రామ! సంవృతరక్షో
గ్రామా! వర్షామేఘ
శ్యామా! సంగ్రామభీమ! జానకరామా!"

2. అమలినశుభచరిత్రా !
కమలదళసమాననేత్ర ! కౌశికమిత్రా !
ద్యుమణికులవార్ధి సోమా !
సమదాసురజనవిరామ! జానకరామా!"

3 విమల సుధాకర వదనా !
సుమనస్ప్రతోష్ఠి సదన ! సుస్థిరకవనా!
కమనీయ రదన ! శత్రువి
షమ! రఘుకుల సార్వభౌమ! జానకరామా!"

ఈపద్యాలపేర్పులో కూడా గొప్ప యథాలభంగావచ్చింది. మొదటి పద్యంలో మొదటి సంబోధన విశేషణాలు చేయునదిగాలేదు. తక్కిన సంబోధనల్లో సంవృతరక్షోగ్రామా, సంగ్రామభీమ, సమదాసుర జనవిరామ, సుస్థిరకవనా, శత్రువిషమ అనేవి కొంతలో కొంత యుద్ధకాండకు సరిపోయేవిగా ఉన్నాయి.

మొత్తంమీద చూస్తే, ఈపద్యాలన్నీ 'జానకిరామా' అనే దోషపూరితమకుటంతో రచించి ఏవో కాండాదులందు చేర్చి

ఉంటారనిపిస్తోంది- కావ్యం శ్రీరామస్తుతితోను, ఫలశ్రుతితోను ముగుస్తోంది. కనుక నారదుడు వాల్మీకికి ఈకథను విన్నవించాడన్న గద్య చేర్చడానికి ఇదరవ మానివేసిఉంటారు.

నిత్యనైవాచారసంపన్నులైనవాళ్ళు విష్ణుపారమ్యాన్ని బోధించే రామాయణకావ్యం రచిస్తుందనటం అసంగతం.

రామాయణకావ్యాన్ని రామునికే అంకితమిచ్చినదనటం మరింత అసంగతం. ప్రాచీనసాంప్రదాయానుసారం కావ్యాన్ని అంకితమివ్వడమంటే ఇప్పటిలా కావ్యంఅంతా వ్రాసి, మొదట్లో "అంకితం-శ్రీరామచంద్రమూర్తి చరణారవిందాలకు" అని ఒక పుటను కేటాయించడంకాదు. కృతిని పొందదలచినవాడు ఇలలోనో, కలలోనో తారసపడి నీకావ్యం నాకు అంకితం చెయ్యమని అడగాలి. కవి అతనిని శ్రోతగా పెట్టుకుని కావ్యం వినిపిస్తూ మధ్యమధ్యలో 'దేవా! అవధరింపుము' అంటూ ఉండాలి. ఆశ్వాసాది, ఆశ్వాసాంతాల్లో ప్రశంసాపద్యాలు ఉండాలి. కృతిపతి వంశవర్ణన, షష్ఠ్యంతాలు మొదలైనవి ఉండాలి. ఇవేవీ ఈకావ్యానికి లేవు. ఉండి నష్టమయ్యాయనుకోవటానికి రాముని పరంగా అవిఉంటే పొసగదు. "ఓరామా! రాముడు ఇలాఅన్నాడు అలాచేసాడు, అలావిలపించాడు..." అనడం ఔచిత్యవంతంగా ఉండదు.

పోతనగారు వీరభద్రవిజయం రచనాకాలానికి శైవుడైనా భాగవతరచనాకాలానికి వైష్ణవుడుగా మారాడని పండితులు

అభిప్రాయపడుతున్నారు. ఆయన కృష్ణకథను శ్రీరామునికి అంకితమిచ్చి రచించాడు కనుక అంకితం విషయంలో అనౌచిత్యం కలుగలేదు.

ఈ రామాయణ కాండాంతగద్యలోని విషయాలను, కావ్యారంభంలో మొల్లను గూర్చిన పద్యాలలోని విషయాలను గల వైషమ్యాన్ని ముందటివ్యాసంలో చూశాం. కావ్యం చివరిలో గద్యకుపైన స్తుతిపూర్వకమైన ఒక మాలినీవృత్తముంది. దాని చివర "కావుమా మమ్ము రామా!" అని ఉంది. దానిని కావ్యారంభంలోని దేవతాస్తుతిపద్యాల చివరనగల 'మాకు శుభంబుల నిడు', 'మాకభీష్టార్థములనిడు' వంటి వాక్యాలతో చేర్చిచూస్తే ఈ పద్యాలన్నీ కావ్యరచనతో సంబంధంలేనివారివని స్పష్టపడుతుంది.

ఈ రామాయణాన్ని మొల్లపై ఆపాదించడానికి అవతారికను కాండాది, కాండాంత పద్యాలను, కాండాంత గద్యను ఎవరో రచించి చేర్చి ఉంటారు. మొల్లకూ ఈ రామాయణానికీ ఎలాంటి సంబంధమూలేదు.



# 6. మొల్లదికాని రామాయణము - 3

## కావ్యత్వనిరాకరణము

"... మొల్ల నామధేయవిరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యమునందు..." అని కాండాంతగద్యలో మహాకావ్యంగా పేర్కొనబడిన గ్రంథం మొల్ల రచనకాదని చెప్తున్నాం. అయితే, ఆమహాకావ్యం ఎవరిదై ఉంటుంది అనేప్రశ్న వెంటనే వస్తుంది. ముందుగా ఈగ్రంథం మహాకావ్య మవుతుందా అన్న విషయాన్ని పరిశీలిద్దాం.

మానవునికి శరీరము, ఆత్మ ఉన్నట్లే కావ్యానికి శరీరమూ ఆత్మ ఉంటాయి. "ఇతివృత్తంతు కావ్యస్య శరీరంపరికీర్తితమ్"- కథయే కావ్యశరీరమని భరతముని నాట్యశాస్త్రంలో ప్రతిపాదించాడు. కథకు అనుగుణంగా పాత్రలు తీర్చిదిద్దబడతాయి; రసపోషణ జరుగుతుంది; వర్ణనలు చేయబడతాయి; అలంకారాలు కూర్చబడతాయి; గుణాలూ, వృత్తులూ, రీతులూ మొదలైనవన్నీ కథను పరిపుష్టం చేస్తాయి. కథను అప్రధానంగా చేసి, ఇతర సాధనాలవల్ల కావ్యత్వాన్ని సాధించలేం. ప్రస్తుత రామాయణంలో సుందరకాండ, యుద్ధకాండలువిస్తృతంగాను, ముందటి కాండలు అతిసంగ్రహంగాను ఉన్నాయి. దీననిబట్టి యీగ్రంథంలో రామకథ అప్రధానమని స్పష్టపడుతోంది.

# 6. మొల్లదికాని రామాయణము - 3

## కావ్యత్వనిరాకరణము

"... మొల్ల నామధేయవిరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యమునందు..." అని కాండాంతగద్యలో మహాకావ్యంగా పేర్కొనబడిన గ్రంథం మొల్ల రచనకాదని చెప్పుతున్నాం. అయితే, ఆమహాకావ్యం ఎవరిదై ఉంటుంది అనేప్రశ్న వెంటనే వస్తుంది. ముందుగా ఈగ్రంథం మహాకావ్య మవుతుందా అన్న విషయాన్ని పరిశీలిద్దాం.

మానవునికి శరీరము, ఆత్మ ఉన్నట్లే కావ్యానికి శరీరమూ ఆత్మ ఉంటాయి. "ఇతివృత్తంతు కావ్యస్య శరీరంపరికీర్తితమ్":- కథయే కావ్యశరీరమని భరతముని నాట్యశాస్త్రంలో ప్రతిపాదించాడు. కథకు అనుగుణంగా పాత్రలు తీర్చిదిద్దబడతాయి; రసపోషణ జరుగుతుంది; వర్ణనలు చేయబడతాయి; అలంకారాలు కూర్చబడతాయి; గుణాలూ, వృత్తులూ, రీతులూ మొదలైనవన్నీ కథను పరిపుష్టం చేస్తాయి. కథను అప్రధానంగా చేసి, ఇతర సాధనాలవల్ల కావ్యత్వాన్ని సాధించలేం. ప్రస్తుత రామాయణంలో సుందరకాండ, యుద్ధకాండలువిస్తృతంగాను, ముందటి కాండలు అతిసంగ్రహంగాను ఉన్నాయి. దీననిబట్టి యీ గ్రంథంలో రామకథ అప్రధానమని స్పష్టపడుతోంది.

బడని గ్రంథం రామాయణమే కానేరదు. ప్రస్తుత గ్రంథంలో రాముని యీలక్షణాలు అక్కడక్కడా ప్రస్తుతింపబడ్డాయి కానీ కథాపరంగా పోషింపబడలేదు. కరుణ రామకథకు ఆత్మ అనదగిన 'ధర్మపాలన' మన్నా ఈ గ్రంథంలో నొక్కి చెప్పబడలేదు.

రామకథను మించిన కథాసుధ ప్రపంచంలో మరొకటి ఉండదు. 'రామ' నామమే మధురాతిమధురం; 'రామ' స్మరణమే కల్మషహరణం. రామకథ ఆద్యంతమూ అత్యంతరస రమణీయమైనది. తిక్కనగారు,

"ఎత్తఱినైనను ధీరో
దాత్త నృపోత్తముఁడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్యము...." ని చెప్పినారు.

ఆకథను ఎంతమంది, ఎన్నిభాషల్లో, ఎన్ని ప్రక్రియల్లో మరల మరల రచించినా లోకానికి తనివితీరదు. వ్రాసేవారికీ చాలు ననిపించదు. కనుకనే, విశ్వనాథవారు, "...తలచిన రామునే తలచెద నేనుస నాభక్తి రచనలు నావిగాన" అని చెప్పుచున్నారు. రామకథలోని రసనిర్భరతే అంతటి ఆకర్షణకు మూలం. అటువంటి రామకథలోని రసవద్ఘట్టాలన్నీ ఈగ్రంథంలో, కేవల కథనంతో సాగిపోయాయి. రామజననం, విద్యాభ్యాసం, బాలకాండ 45వ వచనంలో, సీతారామకళ్యాణం బాల-83 వచనంలోను పేలవంగా చెప్పబడ్డాయి. అయోధ్యకాండలో రామువనగమనం 30వ వచనంలోను, విరాధవధ, రాముడు మునులకు

అభయమివ్వడం వంటి ఘనకార్యాలు 42వ వచనంలోను చెప్ప బడ్డాయి- శూర్పణఖ వృత్తాంతం అరణ్యకాండ 8, 26 వచనాల్లో వచ్చింది. కిష్కింధ 9వ వచనంలో రామ సుగ్రీవుల మైత్రి కుదిరిన సన్నివేశం చెప్పబడింది. ఇలా యించుమించుగా ప్రధాన కథంతా వచనాల్లోనే సాగింది. సుందరకాండ విషయానికి వస్తే ఒక విశేషాన్ని గమనిస్తాం. ఈ కాండలోని వచనాలను కొద్దిగామార్చి వరుసగాచేర్చి చదువుతుంటే కథ నడిచిపోతుంది. దీనిసబట్టి ఈ గ్రంథంపై పరిశోధనచేసిన డాక్టర్ నాగమణిగారు మొల్ల మొదట వచన రామాయణాన్ని రచించి, పిదప చంపూ రామాయణంగా మార్చిందేమోనని భావించారు. ఈగ్రంథం ఆసాంతమూ పరిశీలిస్తే, ఒకవిషయంబోధపడుతుంది. ఈగ్రంథం కావాలనికావ్యంగా వ్రాయబడిందికాదు. పాఠప్రవచనంకోసమో, పురాణప్రవచనం కోసమో సంగ్రహంగా వచనంలో మొదట వ్రాయబడి ఉంటుంది. కాలాంతరాన వివిధవ్యక్తులచే పద్యాలు కూర్చబడిఉంటాయి. ప్రవచనంవల్ల బహుళప్రచారంపొందినా ప్రామాణికతకోసం ఈ గ్రంథం మొల్లకు ఆపాదించబడిఉంటుంది మొల్ల రామాయణం రచించినట్లుగా రూఢికెక్కింది. ఆమె రామాయణం కాలగర్భంలో కలిసిపోయిఉంటుంది. మొల్లకు గల ప్రఖ్యాతినిబట్టి యీ ప్రవచనగ్రంథం మొల్లకు ముడిపెట్టబడి ఉంటుంది.

ఇది ప్రవచనగ్రంథమే అనడానికి గ్రంథంనుండి ఎన్నో ఆధారాలు చూపవచ్చు. ముచ్చట బాలకాండనుండి రెండుమూడు చూద్దాం —

46వ పద్యంలో దశరథుని కొలువునకు వచ్చి "కుశిక పుత్రుఁడర్ఘిదీవించి, తావచ్చినట్టి కార్య మధిపునకుఁజెప్ప..." ననిఉంది. ఆముని వచ్చినకార్యమేమిటో ప్రవచన సమయంలో వ్యాఖ్యానింపబడుతుంది. కనుకనే దశరథుడు అదిరిపడ్డాడని ఆపద్యంలో చెప్పబడింది. అటుపైన విశ్వామిత్రుడు క్రతు రక్షణార్థం రాముసెతనతో పంపవలసిందని ప్రియోక్తులు పలికాడు. ఆమాటలకు 'మారాడనోడి' దశరథుడు రామలక్ష్మణులను 'ఆనందవార్ధిమునుఁగుచు' ఆమునితో పంపాడు. అదిరిపడినవాడు అంతలోనే ఆనందపడటానికి దశరథుడేమీ వెఱ్ఱివాడుకాడు. కనుక ఈమధ్యలో ముఖ్యంగా చాలావ్యాఖ్యానం నడవాల్సిఉంటుంది.

తాటకవధ ఘట్టంకూడా వ్యాఖ్యానసాపేక్షమై అనౌచిత్యంగా కనపడే రచనయే.

> "తాటక వచ్చిన దదిగో
> నాటఁగ నాఁడుదని మేలమాడక నీవీ
> పాటి పడనేయుమని తన
> చాటున భయపడెడి రామచంద్రుదన కనిమెన్. 52

"ఇట్లు చెప్పిన యామునిచంద్రుని పల్కులాలించి రామ చంద్రుండు తన యంతరంగమ్మున నిట్లని వితర్కించె. 53

> ఈయాఁడుదానిఁ జంపఁగ
> నాయమ్మున కేమిగొప్ప నగరేవీరుల్
> చీయని రోయుచు నమ్ముని
> నాయక భయ మెఱిఁగి తనమనమ్మున నలుకన్. 54

52వ పద్యం - 53వ వచనం మధ్య కొంతవ్యాఖ్యానంలేనిదే పద్యంలోని 'అనియెన్' అనే క్రియకూ, వచనంలోని 'ఇట్లుచెప్పిన' అనేమాటకూ పొంతన కుదరదు. అంతేకాక, భయపడి విశ్వామిత్రుని చాటునకు పోయినరామునిలో వీరత్వం కలిగి, ఆతడాన్ని చంపడం అవమానకర మనేభావన, రోఁత కలగాలంటే కొంత సమాయత్తత కల్పించబడవలసి వస్తుంది. అదంతా మౌఖికంగా జరిగిఉండకపోతే యుక్తమైన సందర్భశుద్ధి చేకూరదు.

కొన్నికొన్ని సందర్భాల్లోగల పద్యాల నడకనుబట్టికూడా ఈగ్రంథం ప్రవచనగ్రంథమేనని నిర్ధారింపవచ్చు. ఉదాహరణకు బాలకాండలోని అహల్యకథలో వెంటగల ఉపలము 'సుదతిగఁ జూపట్టి నిలిచె సురుచిరరీతిన్', వెంటనే,

> "ఆమునివల్లభుండు గొనియాడుచుఁ బాడుచు వేడ్కతోడ శ్రీ
> రామునిఁ జూచియిట్లనియె రామ! భవత్పదధూళిసోఁక యీ
> భామినిరాయి మున్ను కులపావన చూడఁగఁ జిత్రమయ్యె నీ
> నామ మెఱుంగు వారలకు నమ్మఁగవచ్చును ముక్తియుక్తులున్
> **64**

"అని యక్కాంతారత్నంబు పూర్వవృత్తాంతం బంతయు నెంతయు సంతసమ్మున నమ్మనుజేంద్రనందనుల కెఱింగింపుచు..." 65

అని చెప్పబడింది. రాతినుండి స్త్రీస్థితినిపొందిన అహల్యను గూర్చిన ఆశ్చర్యప్రకటనమంతా వ్యాఖ్యానంలో సాగిపోగా, ఆ మునివల్ల ఘని కొనియాడుట, పాడుట సార్థకమై, "రామ! భవత్పదధూళి సోకి యీభామిని రాయిమున్న" ... (మరిప్పుడో? నీమహిమ ఏమనివర్ణింపనయ్యా! ఈమె యిప్పుడు ఆదోషమంతా పోయి) కులపావన! చూడఁగఁ జిత్రమయ్యె (కాదామరి! నీపాద ధూళికే ఈమెకు శాపవిముక్తి కలిగిందంటే మాటలా? ధూళి దాకా ఎందుకు? నీనామమేచాలు, కటికబోయవాడు వాల్మీకి మహర్షిగామారింది ఆనామంవల్లనే గదా! కనుకనే) "నీనామ మెఱుంగు వారలకు నమ్మఁగవచ్చును భుక్తి ముక్తులున్" (ఈస్త్రీఎవరనుకుంటున్నావు? గౌతమమహర్షియొక్క ధర్మపత్ని! ఈమెకు ఇంద్రునివల్ల కళంకంఁటి భర్తృశాపానికి గురయిందయ్యా-ఇన్నాళ్ళుగా రాయిగాపడిఉంది, నేటికి నీవల్ల విమోచనం పొందింది.) "అని యత్యాంతారత్నంబు పూర్వవృత్తాంతంబంతయు..." అని ఉంటేనేగాని పై పద్యానికి, వచనానికి అన్వయం కుదరదు.

కాండకు కాండకు మధ్యలో కూడా కొంత వ్యాఖ్యానం లేనిదే కథాగతికి, అనుసంధానతకు విఘాతం కలుగుతున్న తావులు అనేకం ఈగ్రంథంలో ఉన్నాయి. ముఖ్యంగా బాల-అయోధ్యా కాండలనడుమ సీతారాముల అన్యోన్యత, సంయోగ శృంగారమూ మౌఖికంగా వివరించవలసిఉంది. అలా వివరించకపోతే అరణ్య కాండలోని శ్రీరాముని సీతావియోగదుఃఖమంతా అసంబద్ధమూ, అర్థరహితమూ అవుతాయి.

అయోధ్యాకాండలో దశరథుడు రామపట్టాభిషేకాభిలాషను సభలో ప్రకటించి, గురువుల అనుమతిపొంది, మంత్రులనాజ్ఞాపించిన తరువాత ఎంతోకథాభాగం వ్యాఖ్యానరూపంలో సాగితీరాలి. దశరథుని నిర్ణయానికి మంత్రులు, ప్రజలు, రాణులు హర్షాన్ని వెలిబుచ్చటం, ఏర్పాట్లు జరిగిపోవటం, రాత్రికాగానే మహారాజు కైకేయి దగ్గరకు రావడం, అంతకుముందే (మంథరదుర్బోధచే) కైకేయి పథకం సిద్ధంచేసుకోవడం వంటి కథంతా మౌఖికంగా వివరింపబడితీరాలి. లేకపోతే కథనానికి ఆటంకంవచ్చితీరుతుంది.

సుందరకాండలో మరింతస్పష్టంగా ఈ ప్రవచనరీతి కనబడుతుంది.

ఈగ్రంథం ప్రవచనగ్రంథమే కనుక కాకపోతే దీనిలోని వర్ణనలను సందర్భశుద్ధిలేనివిగాను, అసంగతాలుగాను చెప్పవలసివస్తుంది. ఆవర్ణనలు కథనాన్ని కబళించేవిగాకూడా ఉన్నాయి. ఉదాహరణకు అయోధ్యాకాండలోని సూర్యాస్తమయ, అంధకార, చంద్రోదయ, చంద్రికా వర్ణనలు, అరుణోదయ, ప్రభాతవర్ణనలు (మొత్తం 19 పద్యగద్యములు) కథను కుంటుపరచినవని చెప్పవచ్చును.

పండిత కంగూరి సుబ్బారావు పంతులుగారు తమ 'ఆంధ్ర వాఙ్మయచరిత్రము'లో మొల్ల రామాయణాన్ని గురించి, "ఇది యాంధ్రదేశమున స్త్రీలు, బాలురు కూడఁజదువుదురు. వీథిబడు

లలోఁబూర్వము పఠనీయముగ నుండెడి చక్కని చిన్న రామా యణము” అనిచెప్పిరి.

డాక్టర్ కోలవెన్ను మలయవాసినిగారుకూడా తమ “ఆంధ్ర వాఙ్మయము - రామాయణము” అనే సిద్ధాంత గ్రంథంలో “...సంక్షిప్తమయ్యు సమగ్రమయిన రామాయణమా మెది. గత శతాబ్ద్యంతమువరకు ఆమె రామాయణము వీథిబడులలో ప్రత్యేక పాఠ్యగ్రంథముగ నుండెడిది. సంక్షిప్తమయ్యు, సమగ్రమగు దానిరూపమే దానికి అగౌరవమును కలిగించినది.” అని మొల్ల రామాయణాన్ని ప్రశంసించారు.

తెలుగులో ఎన్నో రామాయణాలు ఉండగా వీథిబడులలో పాఠ్యాంశంగా బోధించబడే గౌరవం ఈగ్రంథానికి దక్కటానికి కారణం ఇది సంక్షిప్తమూ, సమగ్రమూ అవటంకావచ్చు. ప్రవచన రూపంలో బహుళప్రచారం పొందటమే అయిఉంటుంది. ప్రవచనం చేసే పండితులవద్ద పద్యాలు వ్రాయించుకుని, వీథిబడులను నిర్వహించేవారు పిల్లలకు ఆపద్యాలను నేర్పుతూ ఉండి ఉంటారు. స్త్రీలను ఆకర్షించటంకోసం ఈకావ్యాన్ని ఒకస్త్రీ రచించింది అని చెప్పవలసిన అవసరం కలిగి ఉంటుంది. మొల్లను గురించి కవయిత్రిగా లోకంలో ఎన్నోకట్టుకథలు ప్రచారంలో ఉండిఉండటం వల్ల ఆమె పేరుమీద దీనికిప్రామాణికత, ప్రచారమూ కలిగింప దలచి ఎవరో ఈకావ్యాన్ని ఆమెకు అంటగట్టిఉంటారు. వారే అవతారికను, కాండాది, కాండాంతపద్యగద్యలనుకల్పించిఉంటారు.

సాధారణంగా పూర్వం వీధిబడులలో సంస్కృతపరిజ్ఞానం కోసం శబ్దమంజరి, అమరకోశం, బాలరామాయణం, రఘువంశం తప్పక బోధించేవారు. తెలుగుభాషాపరిజ్ఞానంకోసం పెద్దబాలశిక్ష, నిఘంటుత్రియం, శతకాలు, ఒకటిరెండు కావ్యాలు బోధించేవారు. సంస్కృతంలోని బాలరామాయణాన్ని పోలిఉండేటట్లుగా సంక్షేప మైన ఈతెలుగురామాయణాన్ని తీర్చిదిద్దడానికై కొంత ప్రయత్నం జరిగినట్లుగా కనుపిస్తుంది. నారదుడు వాల్మీకికి ఉపదేశిస్తున్నట్లుగా గద్యాలను చేర్చటం, ఫలశ్రుతిని (యుద్ధకాండ-136వ పద్యం) కల్పించటం ఇందుకు నిదర్శనాలు.

ఈగ్రంథంలోని వర్ణనలనుబట్టి మొల్ల ఈకావ్యాన్ని ప్రబంధంగా తీర్చి దిద్దాలని ప్రయత్నించినట్లుగా పరిశోధకులు ఊహిస్తున్నారు; కాని వారిఊహలు సరికావు. ప్రబంధాల్లోని వర్ణనలను అనుకరిస్తూ లేఖకులు చేర్చిన వర్ణనలే కానీ అవి కథతో పుట్టినవిగా కనుపడవు. ప్రవచన సమయమున అన్ని వర్గాల ప్రజలను ఆకట్టుకునేందుకు అవి చేర్చబడి ఉంటాయి. నేటి నవలల్లోను, సినిమాల్లోను ఇట్టికల్పనలను, 'హోపుసామగ్రి' 'మసాలాదినుసులు' గా చెప్పుకుంటున్నాం;

కడమాటగా, కావ్యమే అనదగని ఈగ్రంథానికి మొల్ల గ్రంథకర్త కాకపోతే మరెవరు గ్రంథకర్త అన్నప్రశ్న అర్థ రహితమనేచెప్పాలి. ఈగ్రంథం భక్తిప్రబోధకంగా లేకపోవడం అహల్యకథ, శబరివృత్తాంతం మిక్కిలిగా సంక్షేపింపబడటం,

వేశ్యల వర్ణన అతిగా ఉండటంవంటి అనేకానేకకారణాలవల్ల మొల్ల రచనకాదని ఘంటాపథంగా చెప్పవచ్చు. శుభలేఖలు వ్రాయించి పంపుట (బాల-82 వచనం), కూరలు'కారంగా' తోచడం, ఆదుర్దా అనే అర్థంలో 'కంగారు' పద ప్రయోగం (కిష్కింధ-24వ పద్యం). గుజ్జపు పౌజులు (సుందర - 176 పద్యం), చమురుతో వండించడం (సుందర—200 పద్యం) వంటి పదాల ప్రయోగాన్నిబట్టి యీ గ్రంథం అంత ప్రాచీనమైనదికాదని, దక్షిణాంధ్రయుగానంతరం రూపొందించేననీ చెప్పడగియున్నది. ఈదృష్టితో పరిశోధిస్తే ఈగ్రంథాన్నిగురించి మరిన్ని విశేషాలు వెలుగులోకి వస్తాయి. విజ్ఞులు ఈ ప్రతిపాదనను సహృదయంతో స్వీకరింతురుగాక !

(మొల్ల రామాయణంపై పరిశోధించి, పట్టాపొందిఁ, తాను రూపొందించిన అముద్రిత సిద్ధాంతగ్రంథాన్ని పరిశీలన నిమిత్తం నాకిచ్చితోడ్పడిన శ్రీమతి డాక్టర్ టి. నాగమణిగారికినాకృతజ్ఞతలు)



# ఉపయుక్త గ్రంథాలు

1. ఆంధ్రవాఙ్మయ చరిత్రము, పండిత పంగూరి సుబ్బారావు పంతులు

2; ఆంధ్రవాఙ్మయము-రామాయణము, శ్రీమతి కోలవెన్ను మలయవాసిని

3. మొల్ల రామాయణము (1927), కొండపల్లి వీరవెంకయ్య గారి ప్రచురణ

4. మొల్ల రామాయణము (1987), బాలసరస్వతి బుక్‌డిపో వారి ప్రచురణ

5. మొల్ల రామాయణము(1990) యం. శేషాచలం అండ్ కో వారి ప్రచురణ

6. రామాయణము (1968) వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారి ప్రచురణ

7. సమగ్రాంధ్రసాహిత్యం, 8వ సంపుటం, ఆరుద్ర

8. అముద్రితసిద్ధాంతవ్యాసము, శ్రీమతి టి. నాగమణి

— ఇంకా మరికొన్ని వ్యాసాలు



# 7. ఎంతకుతేఁడు నారదమునీంద్రుఁడు....?

నందితిమ్మన రచించిన పారిజాతాపహరణ ప్రబంధంలో చెలికత్తె సత్యభామతో రుక్మిణి యింట తాను విన్నవి కన్నవి విన్నవిస్తూ —

> *"ఎంతకు తేఁడు నారదమునీంద్రుడు; శౌరి వినంగ, రుక్మిణీ కాంతవినంగ, నేను వినఁగాఁ బలికెం బలిఁ గూర్చుదాన నా యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్ వంతునవచ్చు సత్యగరువంబిఁకఁ జెల్లదటంచు మానినీ!"*

అన్నది. నిజమే, ఆకథలో నారదుడు ఎంతటివాడైనా తగినవాడే ననిపించాడు. తన నాటకంలో జగన్నాటకసూత్రధారిని పాత్రధారిగా చేసి తాను సూత్రధారి అయ్యాడు.

ద్వారకే వైకుంఠం, రుక్మిణియే లక్ష్మి అని భావించి, అతడు స్వర్గంనుంచి వస్తూ, "ఫలం, పుష్పం, పత్రం, తోయం..." అన్నారుగనుక, ఉత్త చేతుల్తో రాలేక ఒక పారిజాత పుష్పాన్ని పట్టుకువచ్చాడు. కృష్ణుడు రుక్మిణీదేవి మందిరంలో ఉన్నసమయం చూసుకుని వెళ్ళి దర్శనంచేసికొని, గొప్పగా ఆ పువ్వును అతని చేతుల్లో పెట్టాడు. పెట్టి ఊరుకున్నాడా? కృష్ణుని మనస్సు సందిగ్ధమగ్నమవ్వడం కనిపెట్టి రుక్మిణికే యివ్వమన్నట్లు కనుసన్న చేశాడు. కృష్ణుడు, 'కడుఁగొనఁ జిన్నసవ్వు దొలఁక' నారదుడు చెప్పినట్లే చేశాడు. అంతే, ఇంకేముంది?

సమిధను వేసి, ఆజ్యం పోసి కృష్ణుని కొంపను అంటించేశాడు నారదుడు. పర్యవసానం అంతటి పురుషోత్తముడూ "దాసుని తప్పులు దండముతో సరి" అన్నట్లు సత్యభామపాదాలకు మ్రొక్క వలసి వచ్చింది.

నారదునికి అదెక్కడి సరదాయోమరి! 'సాక్షాత్తూ నువ్వు శ్రీమన్నారాయణుడివి, నేను నీభక్తుణ్ణి' అంటూ ఆయన కొంపకే చిచ్చు పెట్టాడు.

ఎప్పుడూ దొరకనట్టు ఆపారిజాతపుష్పాన్నే తేవడమేమిటో?

పదహారువేలఎనిమిదిమందిభార్యలున్న కృష్ణుడికి ఒక్కటంటే ఒక్కపువ్వును కానుక పెట్టడమేమిటో?

ఇచ్చేసి ఊరుకోవచ్చుగదా, రుక్మిణికిఇప్పించి, ఆతర్వాత సత్యభామ ప్రసక్తి తెచ్చి, "...ఇంతకున్ మ్రొక్కకయున్నె నీమహిమ సూచిన, బోటులు విన్నవించినన్" అని కావాలని పలికాడు.

నారదునికి ఏంపని లేకపోతేపోయే — కృష్ణుడికన్నా కొద్దిపాటి వివేకముండాలి గదా! భక్తుణ్ణి చూడగానే ఒళ్ళు తెలియదో ఏమో ఆయనకీను!

*"సురసంయమివర! మీరిటు*
*కరుదేరఁగ నిప్పుడేఁగృతార్థుఁడ నయితిన్*
*నిరతంబు మీరు నాపయిఁ*
*గరుణ గలిగియునికి యుదియ కారణము సుఁడీ!"*

అంటూ ఆకలహాశనుణ్ణి కౌగలించుకొన్నంతపని చేశాడు. ఆయన రాకవల్ల ఈయన కృతార్థుడు అయ్యాడట! ఆయనగారికి ఈయన పట్ల గలది అవ్యాజమైన కరుణట! ఈయనేమో పేరుకు పెద్ద జగన్నాటకసూత్రధారి! ఓ బ్రహ్మచారి దాంపత్య విషయంలో కల్పించుకొని, ముద్దులభార్య అయిన సత్యభామాదేవిని సభ్యతా సంస్కారాలు లేకుండా "...నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతలసత్యః..." అంటూ నోటికివచ్చినట్లల్లా ప్రేలుతూఉంటే చేతకానిపద్దమ్మలా ఊరకుండిపోయాడు. "వలదని వారింప వలదె వల్లభుఁడతనిన్" అని సత్యాదేవి బాధపడిందంటే పడదా మరి ?

నారదుడు అలా హద్దులు మీరడం కృష్ణునికి కూడా ఇష్టమే నేమో అనుకుందామంటే, ఎందుకు ? అన్న ప్రశ్న వస్తుంది వెంటనే. సత్యభామ గర్వభంగం కోసమనుకోవాలి. ఆమె గర్వం వల్ల నారదునికి వచ్చిన నష్టం ఏమీ లేదుగదా? కృష్ణుడు కొద్దిగా కష్టపడుతూ ఉండాలి. అతనికి ఉపకారం చేద్దామని నారదుడు భావించాడేమో, అందుకే కృష్ణుడూ ఊరకున్నాడేమో అనుకొందా మంటే, మొత్తం కావ్యంలో సత్యభామ గర్వం భంగపడిందెక్క డసలు? ఆమె ఏడిచి విందుచేయించుకొన్నదే! కృష్ణునిచే కాళ్ళకు మ్రొక్కించుకుని, తన్ని, బ్రతిమాలించుకుని, 'ఒక్కపువ్వేమిటి, మొత్తం చెట్టే తెచ్చి నీదొడ్లో నాటుతా' నని వాగ్దానం చేయించు కొని గదా ఆమె అలకపాన్పు దిగింది. అన్నంతపనీ చేయించు కొనిగాని వదల్లేదే ఆమె కృష్ణుణ్ణి! మరి, ఇంకెక్కడి సత్యా గర్వభంగం ?

కనుక, అసలుకథకు మూలం ఇదికాదనుకోవాలి.

కావ్యారంభంలో జనమేజయుడు వైశంపాయనుని ఇలా ప్రశ్నించాడు- 'దేవతలను రక్షించడానికై యదువంశంలో పుట్టిన దానవారాతి ఆదేవతలకు ఆధారమైన పారిజాతాన్ని పుడమికేరీతి దెచ్చె? వారిష్టపడి ఇచ్చారా? ఆతడు బలవంతంగా ఎత్తుకు వచ్చాడా?'

ఈప్రశ్నకు సమాధానమే పారిజాతాపహరణ కావ్యమంతాను. కాబట్టి, నారదుడు, 'ఇంద్రద్రుమం' గా గణింపబడుతూ, చేరడానికి తుమ్మెదలు కూడా భయపడే పారిజాతాన్ని ఏదోలా భూలోకానికి తెప్పించి, యిటు మానవలోకానికి అటు దేవలోకానికి కూడా కల్యాణం కలిగించాలని సంకల్పించి వచ్చాడనుకోవాలి.

పారిజాతపుప్రభావం అసామాన్యం, దానిని స్వర్గంనుంచి తెస్తూండగా చూసిన ద్వారకలోని లోభులగృహాలన్నీ ధనధాన్యరాశితోను, ఏనుగులూ, గుఱ్ఱాలుండే శాలలతోను, మణిసౌధాలతోను, గోవులూ, రథాలూ,భటులూ, మణిభూషణాలతోను తామరతంపరైపోయాయి. దాని గాలిసోకిన ముసలివారికి యౌవనం వచ్చింది. చెవిటివారు వినగలిగారు. గ్రుడ్డివారు చూడగలిగారు. వికలాంగులు నడువగలిగారు. అంతటి మహత్తరమైనది ఆ వృక్షం. లోకకల్యాణానికి ఉపయోగపడవలసిన అవృక్షాన్ని పెళ్ళాంపరం చేశాడు ఇంద్రుడు. దుర్నిరీక్ష్యమైన ఆచెట్టునుంచి

పువ్వు తెెంచుకు రావడమంటె మాటలా? ఎన్ని తంటాలు పడ్డాడో గాని మొత్తానికొక్క పువ్వు సంపాదించితెచ్చి, కృష్ణునికి యిచ్చి, కథ నడిపిన నారదుడు 'తంపులమారి' ఎలా అవుతాడు?

ఇంద్రునికి ఇంద్రాణి అంటే ప్రాణం. కనుకనే, అతడు పారిజాతవృక్షాన్ని ఆమెకు 'దక్కగ' నిచ్చాడు.

కృష్ణునికి సత్యభామ అంటే ప్రాణం. ఆమె కోరితే దేని నైనాసరే సాధించి తెచ్చియిస్తాడు.

సత్యభామ పారిజాతవృక్షాన్ని కోరేలాచేయాలి. దానిపై ఇంద్రాణి గుత్తాధిపత్యం అప్పుడుగాని పోదు. లోకానికి దాని వల్ల జరుగవలసిన ఉపకారం జరిగితీరాలి. ఇదీ నారదుని సంకల్పం. ఇందుకుమార్గం "అట్నుంచి నరుక్కురావడమే!" కనుక, రుక్మిణికి శ్రీకృష్ణునిచే పుష్పాన్ని యిప్పించడంతో నాట కాన్ని మొదలుపెట్టాడు నారదుడు. సత్యభామ స్వభావంలోని ప్రధానాంశాలు ఈర్ష్యామానాలు - ఇందుకు ఎంతగానో సహకరిం చాయి ఆయనకు. ఆమెలోని ఈర్ష్యను రెచ్చగొట్టి, అభిమానాన్ని దెబ్బకొట్టి, ఆమెద్వారా కార్యమును సాధించగలిగాడు ఆవేలుపుం దపసి.

ఈర్ష్య పాములాంటిది. ఎదుటివారిని అంతం చేస్తుంది. అభిమానం అగ్నిలాంటిది. కలవానిని కాల్చివేస్తుంది.

సమర్థుడైన మహానుభావుడు ఈరెంటిని జగత్కల్యాణానికి ఉపయోగపడేలా చేయవచ్చును. అలా చేసి చూపించాడు నారదుడు

రుక్మిణీ మందిరంనుంచి వచ్చిన చెలికత్తె,

"అరణాభోజను మతకము
లారుక్మిణి నటన, లా మురాంతకు చెయ్యుల్
చేరికనుంగొనుచో నె
వ్వారికిఁగోపంబు రాదు వారిజనేత్రా!"

అని ముక్తాయించింది. ఆమాటలు విన్న సత్యభామ "ప్రేటువడ్డ యురగాంగనయుంబలె, నేయిపోయ భగ్గున దరికొన్న భీషణ హుతాశనకీలయనంగ లేచినది. ఆమెలోని ఈర్ష్య బుసగొట్టింది. అభిమానము భగ్గుమన్నది.

ఆమెను శాంతింపజేయడం మాయాకల్పనాచతురుడైన ధూర్త గోపాలునికి వెన్నతోబెట్టిన విద్యగదా! ఆవిషయం నారదునికీ తెలుసు. కనుకనే, ప్రద్యుమ్నుణ్ణి అప్పగించి, నాకుకొంచెం పనుంది, వెళ్ళివస్తాననగానే, కృష్ణుణ్ణి వెంటనే వదిలివేశాడు.

కొంచెం పనేం కర్మ? ఆతర్వాత పనంతా కృష్ణునిదే! అప్డామెను బుజ్జగించి,

"ఓలలితేంద్రనీలశకలోపమకైశిక! యింతవంత వీ
కేల లతాంత మాత్రమునకేఁ గలుగ? న్వినుసీకు దేవతా
కేళివనంబు సొన్పి, యనికన్బలసూదనుఁడెత్తి వచ్చినన్
దీలుపడంగఁదోలి, యిటఁదెచ్చెదనిచ్చెదఁబారిజాతమున్"

అని మాటిచ్చాడు. ఆమె అలుక తీరింది. అప్పుడు నారదుడు ఆమె యింటికి వచ్చి, ఆతిథ్యం తీసికొని, తీరికగా ఆమెను కీర్తించి,

*"....నీకు మగఁడు గోరిన కోర్కెల్ ఘటియించుగాక*
*తానెంతటికార్యంబైనదించి, నాదీవనలన్"*

అని దీవించాడు. అంటే, తన దీవన ప్రభావంతో ఆమెభర్త ఆమె కోరినదానిని సాధించిపెట్టాలని నారదుని ఆకాంక్ష. ఆమె కోరేది తాను కోరేదే! అందుకన్నమాట అంతఉదారంగా ఆమెను ఆశీర్వదించాడు.

ఆ ఆశీస్సు ఫలించింది. కృష్ణుడు సత్యభామతో కూడి స్వర్గానికి బయలుదేరాడు, చిన్న మిషపెట్టుకుని. ఆతర్వాత అసలువిషయానికి వచ్చేసరికి ఇంద్రుని కన్నులు వేయును జేవురించాయి. భార్యల వేడుక తీర్చడానికై ఇంద్రోపేంద్రులు తలపడక తప్పనిస్థితి కలిగింది. ఆసన్నివేశం చూసి "రణాశనమౌని నింగిపైఁగుతుకరసాతిరేకమునఁ గుంచియవీచి నటించెనయ్యెడన్."

ఇందుకన్నమాట సురసంయమివరుడు శ్రీకృష్ణుణ్ణి దర్శించింది. ఊరకరారుగదా మహానుభావులు!

సత్యభామ గర్వం మాటంటారా! ఆమె ఎంత గర్విష్ఠో అంత అమాయకురాలు - ఆ అమాయకతను అనరాగా తీసుకునే

పుణ్యకవ్రతం చేయించి, ఆమెను ఆటపట్టించాడు నారదముని. క్రాకపోతే ఏమిటి ?

> *కువలయనేత్రి! తొంటి తనకోపము, గర్వము, మత్సరంబు మా నివినయముం బ్రమోదమును నిండ తొలంగెడునెమ్మనంబున న్నవతులయిండ్లకెల్లఁ దొలునాఁడు క్రమంబుననేగి తద్వ్రతో త్సవమున కామతించి, యతిసంభ్రమలీలలఁ దోడ తేఁదగున్"*

ఇవా వ్రతనియమాలు? ఆ వెఱ్ఱిబాగులతల్లి అలాగే చేసింది పాపం! ఇంద్రాణిపై విజయం ముందు ఇవిచాలాచిన్నవిషయాలనిపించి ఉంటాయి. ఇంతా ఎందుకంటె, "...తాసుంబలీయున్ మనమున నలుగాలు తెలుఁగక యనితరసులభైకసుఖములందుట' కట! ఆమెకు అదేటికొరత?

ఆ అమాయకురాలిని అడ్డంపెట్టుకుని, కృష్ణునితో కలిసి నారదుడు లోకహితార్థం ఆడిన నాటకం కదూ ఈకథంతాను!

అప్పున్న, ఎంతకులేడు నారదమునీంద్రుడు...?!



# 8. ఆధునికాంధ్ర సాహిత్యంలో ఆధ్యాత్మికతేజం

"హిందూదేశము ప్రపంచమునకు ఒసగనున్న కానుక ఆధ్యాత్మిక తేజమే" నని వివేకానందస్వామి ఆధునికయుగ భారతీయులకు గుర్తు చేశారు.

ఆంధ్రుల అదృష్టవిశేషం ఏమిటోగానీ ఆవిర్భావకాలం నుంచీ ఆధునికయుగంవరకూ ఆంధ్రసాహిత్యాన్ని నడుపుతున్నది ఆధ్యాత్మికతేజమే! అంటే, ఆదికవినన్నయ చెప్పుతున్న "జగద్ధితమే" మనసాహిత్య ప్రయోజనంగా కొనసాగుతూవస్తోంది ఇన్నివందల యేళ్ళుగానూ!

విద్యావైజ్ఞానికరంగాల్లోను, సామాజిక జీవనవిధానంలోను ఎన్నోమార్పులకు లోనైన ఆధునికయుగం (క్రీ.శ. 1800 నుంచి నేటి వరకూ) లోని తెలుగుసాహిత్యంపై ఆధ్యాత్మిక ఉద్యమాల ప్రభావాన్ని గురించి స్థూలంగా సమీక్షించుకుందాం ఈవ్యాసంలో.

ముందుగా ఆంధ్రదేశంపై సాహిత్యపరంగాకూడా ప్రభావం చూపించిన ఆధ్యాత్మిక ఉద్యమాలను చూద్దాం. బ్రిటిషువారి పరిపాలనవల్ల మనదేశంలో క్రైస్తవం వేళ్ళూనింది. దానిని కూడా ఒక ఆధ్యాత్మిక ఉద్యమంగా భావించవచ్చు. ఆఉద్యమ ప్రభావంవల్ల తెలుగులో ఆవిర్భవించిన సాహిత్యం చాలానేఉంది మహాకవి జాషువాగారి 'క్రీస్తుచరిత్రము', జ్ఞానానందకవిగారి 'క్రీస్తు ప్రబంధము' వంటివి ప్రత్యేక పరిశీలనార్హాలు. ఈ వ్యాసాన్ని స్వదేశీ ఆధ్యాత్మిక ఉద్యమాలకు పరిమితం చేస్తాను.

ఆధునికయుగంలోని ఆధ్యాత్మికఉద్యమాలు ముఖ్యంగా మూడుతరహాలకు చెందినవి. అవి –

1. పునరుజ్జీవనోద్యమాలు,
2. సంస్కరణోద్యమాలు,
3. సమన్వయోద్యమాలు

1. పునరుజ్జీవనోద్యమాలు – పై దేశికదుష్ప్రభావాలవల్ల 'ధర్మ చ్యుతి' కలుగకుండా జాతి భ్రష్టమయిపోకుండా చూడటం తమ వంతు కర్తవ్యంగా భావించారు శ్రీశంకర, రామానుజ, మధ్వ సంప్రదాయాలకు చెందిన ఆచార్యులూ, పండితులూను. ప్రజలలో ఆయామహానుభావుల బోధనలను ప్రచారం చేయడం ద్వారా నూతనోత్తేజాన్ని కలిగించాలని వారి సంకల్పం. ఫలితంగా ఊరూరా శంకరమఠాలు, రామానుజకూటములు వెలిశాయి. భగవద్గీతాభాష్యాలు,భాగవతప్రవచనాలు, రామాయణప్రసంగాలు, భారతోపన్యాసాలు మొదలైనాయి. మాథ్యూ ఆర్నాల్డు రచించిన 'దిలైట్ ఆఫ్ ఏషియా' అనే మహాగ్రంథం వల్లనో, ఏమో, బుద్ధునికీ, అతనిబోధనలకూ కూడా ప్రజల్లో ఆదరణ పెరిగింది. మరోవైపు కాలప్రభావాన్ని అధిగమించలేని కవులు బహుముఖా లుగా సాగిన ఈ ఉద్యమాలకు స్పందించారు. పురిపండా అప్పల స్వామివంటి అభ్యుదయవాదులు కూడా తమ వ్యావహారిక భాషో ద్యమ ప్రచారానికై రామాయణ భారతాలను ఆశ్రయింపక తప్పలేదు. అదీ కాలమహిమ!

మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి (కృష్ణార్జునచరిత్రము-ద్వ్యర్థికావ్యం), గోపీనాథము వేంకటకవి (రామాయణము,కృష్ణజన్మఖండము), దాసు శ్రీరాములు (దేవీభాగవతము), వడ్డాది సుబ్బరాయకవి (సావిత్రీచరిత్ర, హరిశ్చంద్ర మొదలైనవి), శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, తిరుపతివేంకటకవులు, కాశీ కృష్ణాచార్యులు, చర్ల నారాయణశాస్త్రి, జటావల్లభుల పురుషోత్తం, విశ్వనాథ సత్యనారాయణ, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి మొదలైన సాహితీమూర్తులు ఈ ఉద్యమాలకు అంకితమైనవారే

ఆనందముద్రణాలయం, వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, వేదం వెంకటరాయశాస్త్రి అండ్ సన్సు, బాల సరస్వతీ బుక్‌డిపో, శ్రీరామా పబ్లిషర్సు, ముముక్షుజనపీఠం (ఏలూరు), శ్రీశుకబ్రహ్మాశ్రమం (కాళహస్తి), శ్రీవ్యాసాశ్రమం (ఏర్పేడు), శ్రీగోదా గ్రంథమాల (ముసునూరు), సరస్వతీ గ్రంథమండలి, సాధన గ్రంథమండలి మొదలైన ప్రచురణ సంస్థలు ఎన్నో ఈఉద్యమాల స్ఫూర్తితో నెలకొన్నవే.

మోక్షసాధని, శంకరకృప, ముముక్షువు, వేదాంతభేరి వంటి పత్రికలు ఉద్యమవిస్తరణకు తోడ్పడటమేకాక, ఉన్నతమైన సాహిత్యప్రమాణాలనూ నెలకొల్పాయి.

2. సంస్కరణోద్యమాలు - వేల సంవత్సరాలుగా అనుసరించబడుతూండటంవల్ల అపమార్గాలుపట్టిన సనాతన సంప్రదాయాన్ని

అధునాతనదృష్టితో అనుశీలించి, సంస్కరణపూర్వకమైన ప్రతిపాదనలు చేశారుకొందరు ప్రతిభావంతులూ, ఆత్మావలోకనతత్పరులూ అయిన మహానుభావులు. వారిద్వారా ప్రచారమైనసిద్ధాంతాలు ఉద్యమరూపం ధరించి మన సాహిత్యాన్నికూడా కొంతవరకూ ప్రభావితం చేశాయి.

రాజారామ్మోహనరాయలు స్థాపించిన బ్రహ్మసమాజము, దయానందసరస్వతిగారి ఆర్యసమాజము, స్వామి శివానంద నెలకొల్పిన దివ్యజీవనసమాజము మొదలైనవి ఈవిభాగంలోకి వస్తాయి.

ఆధునికాంధ్రసాహిత్యపై తాళికపడనదగిన కందుకూరి వీరేశలింగం పంతులుగారూ, వారి అనుయాయులూ బ్రహ్మసమాజకులు. సర్వతోముఖమానవప్రగతిసాధన బ్రహ్మసమాజలక్ష్యాల్లో ఒకటి. ఈలక్ష్యసాధనకు అనుగుణంగానే పంతులుగారి సాహిత్యకృషి జరిగింది.

సాహిత్యంలో సంస్కరణదృష్టి ప్రవేశించినది వీరేశలింగం పంతులుగారితోనే అనేవిషయం అందరూ ఎరిగినదే.

3. <u>సమన్వయోద్యమాలు</u> :- శ్రీ రామకృష్ణ పరమహంస, షిరిడీ సాయిబాబా, మాస్టర్ సి. వి. వి., అరవిందయోగి, రమణమహర్షి పరమహంసయోగానంద, మెహర్‌బాబా, జిల్లెళ్ళమూడి అమ్మ, సత్యసాయిబాబా వంటి మహానుభావులు సర్వమానవసౌభ్రాతృ

త్వాన్ని, పరమ ప్రేమతత్వాన్ని ఆధునికయుగానికి అందించడానికి తమతమ జీవితాలను అంకితం చేశారు. రామకృష్ణుని శిష్యులైన వివేకానందస్వామి, బ్రహ్మానందస్వామి వంటివారు ఆధ్యాత్మిక తేజస్సును విశ్వవ్యాప్తం చేయగా, చిరంతనానందస్వామివంటివారు ఆకృషినీ, తద్వారా ఆ వెలుగునూ తెలుగుగడ్డపై అవతరింపజేశారు. శ్రీరామకృష్ణమఠంవారి ప్రచురణలనుగమనిస్తే తెలుగుసాహిత్యం ఎంతగా సంపన్నమైనదోగదా వాటివల్ల అనిపిస్తుంది. పైన చెప్పిన ఒక్కొక్క మహానుభావునిగురించి వచ్చిన సాహిత్యాన్ని ప్రత్యేకించి పరిశీలిస్తే ఎంతో వైవిధ్యంతోకూడిన, శక్తివంతమైన రచనలూ, నిత్యపారాయణయోగ్యమైన మహాగ్రంథాలు ఎన్నో తెలుగులో !

ఈ ఆధ్యాత్మిక ఉద్యమాలవల్ల ఆవిర్భవించిన తెలుగు సాహిత్యంలోని వైవిధ్యాన్నికూడా కించిత్ పరిశీలన చేద్దాం.

1. <u>వ్యాఖ్యానాలూ, వివరణలూ</u> - లెక్కలేనన్ని భగవద్గీతావ్యాఖ్యానాలతోపాటు ఉపనిషత్తులకు, పురాణాలకు, కొన్నికొన్ని వేద సూత్రాలకు చక్కని వ్యాఖ్యానాలూ, విశేష వివరణలూ వచ్చాయి. గీతావ్యాఖ్యానాల్లో బులుసు అప్పన్నశాస్త్రిగారి వ్యాఖ్యానమూ, జ్ఞానేశ్వరీగీతా, గీతామకరందమూ, మంత్రగీతా, గీతాకౌముది ప్రత్యేకించి పేర్కొనదగినవి. గీతకు పద్యానువాదాలూ, గేయాను వాదాలూ కూడా చాలావచ్చాయి. శ్రీపాద శ్రీరామమూర్తిగారు

"మనస్సునియెడ సానమీదను
శ్లోకపాదము లరగదీసి " సారాన్ని గేయరూపంలో

'గీతాలహరి'గా అందించారు.

"అర్థవిజ్ఞానపరిషత్తు" ద్వారా బ్రహ్మశ్రీ చర్ల గణపతి శాస్త్రిగారు చేస్తున్నకృషి అభినందనీయం. 'ఉపనిషత్సుధ' పేరుతో వారు ఉపనిషత్తులకు చక్కని వివరణా, పద్యానువాదమూ చేశారు.

*"అణువుకంటె నణువు; మహత్తునకు మహతు*
*ఆత్మ-ప్రాణి హృదయగుహల నణఁగియుండె*
*నవని నింద్రియశుద్ధిచే నాత్మమహిమఁ*
*గాంచఁగలఁడాశ, చింతయుఁగననివాఁడు."*

ఇలాసాగుతుంది చర్లవారిఅనువాదం. బందరు శ్రీగాయత్రీపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ విద్యాశంకరభారతీస్వామివారు సులభమైన తెలుగుభాషలో పండిత పామర జనరంజకంగా "బ్రహ్మసూత్రకౌముది", "ఉపనిషత్కౌముది", "గాయత్రీకౌముది", "మహాభారతకౌముది", "రామాయణకౌముది", "భాగవతకౌముది", "త్రిపురారహస్య కౌముది" వంటి గ్రంథాలు ఎన్నో రచించి అందించారు. విష్ణుసహస్రనామావళి, లలితాసహస్రనామావళి, నారద భక్తిసూత్రాలు వంటివాటికి సమగ్రమైనవివరణలు ఎన్నో వచ్చాయి. జగద్గురుపీఠస్థాపకులు కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య ప్రాచ్యవిద్యా విభాగాన్ని ఒకదానిని ఏర్పరచి, రుద్రసూక్తమ్, నారాయణసూక్తమ్, సువర్ణసూక్తమ్, సరస్వతీసూక్తమ్, పురుషసూక్తమ్, శ్రీసూక్తమ్, అశ్వనీసూక్తమ్, విష్ణుసహస్రనామం మొదలైనవాటికి మహాద్భుతమైన వివరణలు వ్రాశారు. వారు పోతన భాగవతానికి "రహస్యప్రకాశము"

కూడా కొంతవరకూ వ్రాశారు. వారి శిష్యులు వారికృషిని చక్కగా కొనసాగిస్తూ వివరణగ్రంథాలు వెలువరిస్తున్నారు. శ్రీదేవత సుబ్బారావు (ఆధ్యాత్మసాధక సమితి, హైదరాబాదు) వంటివారు కూడా యథాశక్తి గ్రంథాలు వెలువరిస్తున్నారు.

ఈవిధమైన వివరణలూ, వ్యాఖ్యానాలవల్ల మన సనాతన ధర్మం, వాఙ్మయం పట్ల నూతనసృష్టి ఏర్పడటమేకాక, ఇప్పటి వైజ్ఞానిక ప్రగతికి ఈవాఙ్మయపరిజ్ఞానం ఎంతగానో దోహదం చేస్తున్నది.

2. <u>పద్యకావ్యాలు</u> :- ఆధునికయుగంలోని ఆధ్యాత్మిక ఉద్యమాల స్ఫూర్తితో ఎన్నో మహాకావ్యాలూ, మరెన్నో లఘుకావ్యాలూ, లెక్కలేనన్ని ఖండకృతులూ వచ్చాయి. వీరేశలింగం పంతులు గారు మూడు ఆశ్వాసాల్లో "శుద్ధాంధ్రభారతసంగ్రహము"ను, ఏకాశ్వాసంగా "శుద్ధాంధ్రోత్తర రామాయణము"ను రచించిన సంగతి ఇప్పటివారికి చాలమందికి తెలియదు. శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రిగారు రామాయణ, భారత, భాగవతమహాగ్రంథాలను యథామూలంగా తెలుగుచేశారు. విశ్వనాథావారి "శ్రీమద్రామా యణ కల్పవృక్షం" మహాకావ్యంగా మాన్యతనుపొంది, ఈయుగ సాహిత్యంలోనే తలమానికంగా పరిగణింపబడుతోంది. పెంపరాల వారి "శ్రీశంకరవిజయము", దివిరంగాచార్యులవారి "శ్రీకృష్ణాతి మానుషలత్వము"లు మహాకావ్యములకోవకు చెందినవే. కులపతి ఎక్కిరాలవారి "గోదావైభవము" చక్కని సంకేతకావ్యం.

రాయప్రోలు సుబ్బారావుగారి వంటి ప్రణయ కవులలో కొందరిది లౌకిక ప్రణయం కాదనీ, జీవేశ్వర ప్రణయమనీ విజ్ఞులడువాచ. "తృణకంకణము"లో వారునాయకునిచే చెప్పించిన

> "మనస్సుచే వాక్కుచేత కర్మంబుచేత
> కలుషితములు కాదగినవీ వలపులవని;
> తపనుచే, తాల్మిచే, ధ్యానధారచేత
> లీనమై యైక్యమీయజాలినది ప్రేమ-"

అనేమాటలు ఈవిషయాన్నే నిరూపిస్తున్నాయి. వేంకటపార్వతీశ్వర కవుల "ఏకాంతసేవ", శివశంకరశాస్త్రిగారి కృతులూ, రాధా కృష్ణుల ప్రణయానికి సంబంధించిన వివిధకవుల రచనలూ ఆధ్యాత్మికభావసంపదకు సంబంధించినవే.

కరుణశ్రీగారి ఖండకృతుల్లోను, దువ్వూరివారి "పానశాల" లోను, లక్ష్మణయతీంద్రులవారి 'క్వణత్కింకిణి', 'పూతపూతన' వంటి రచనలలోను ఆయాకవుల అంతర్ముఖత్వం, ఆధ్యాత్మిక సాధనాప్రైభవం ప్రతిబింబిస్తూ ఉంటాయి.

పుట్టపర్తి నారాయణాచార్యుల కృతులు చక్కని ఆధ్యాత్మిక స్ఫూర్తిని కలిగిస్తూ, ఆధునికయుగసాహిత్యంలో విశిష్టతను సంతరించుకున్నాయి.

శతకములవిషయానికి వస్తే, పూర్వయుగాల్లో మాదిరి గానే ఆధునికయుగంలోను అసంఖ్యాకంగా శతకాలు వస్తూనే

ఉన్నాయి. తెలుగులోవచ్చిన శతకాల్లో సుమతీశతకం, కుమార శతకం వంటివి రెండోమూడో తప్ప, ఇంచుమించుగా అన్నీ ఆత్మనివేదనాత్మకాలే! ఆధునిక యుగంలోను ఇదేతీరు కొనసాగడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. వసురాయకవిగారి 'భక్త చింతామణిశతకము', తిరుపతివేంకటకవుల 'కామేశ్వరీశతకము', దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి 'భక్తకల్పద్రుమ శతకము' బాగా ప్రసిద్ధికెక్కాయి. ఇటీవలికాలంలో షిరిడీసాయినిగూర్చి, పుట్టపర్తి సాయీశ్వరునిగూర్చి వస్తున్న శతకాలు అసంఖ్యాకాలు.

3. <u>గేయాలు, పాటలు:-</u> ఏఉద్యమ ప్రచారానికైనా గేయాలు, పాటలూ ఎంతగానో సహకరిస్తాయి. ఆధ్యాత్మికోద్యమాల ప్రచారం విషయానికివస్తే వీటి ప్రాముఖ్యమూ, ప్రాచుర్యమూ విశేషంగా కనిపిస్తుంది. అనుభూతులశిఖరాలనుంచి అమలినంగా సాగివచ్చిన స్తుతిగంగాలహరులు శ్రవణమాత్రంచేత సగర పుత్రులవంటి వేలాదిభక్తుల హృదయాలను సంజీవింపజేస్తున్నాయి. ఈపాటల్లో భక్తితత్పరతేకాక చక్కని కవిత్వపు గుబాళింపు, మంచి భావుకత కూడా ఉంటుంది. ఉదాహరణకు 'సాయిరామనౌక సాగిపోతున్నది..." అనేగీతం ఒకటి చాలును.

4. <u>వచన గీతాలు -</u> వచన కవిత్వం అనే ప్రక్రియ అభ్యుదయ కవితోద్యమం వల్ల ప్రచారంలోకి వచ్చినా ఆధ్యాత్మిక కవులు దానిని చక్కగా ఉపయోగించుకొంటున్నారు. చలంగారి 'విన్నపాలు', 'సుధ' ఉత్తమ వచనగీతాలు. వాటినిండా అనుభూతులే!

"తేనె
తనమాధుర్యంలో తాను మైమరచినట్టు,
ఆకాశం
తననీలంలో తాను మూర్ఛిల్లినట్టు,
అగ్ని
తన జ్వాలలో తాను వెలిగినట్టు,
కాంతి
తన తేజాన్ని తానే తాగినట్టు
ఆనందమ్
నేనైన నేను
అంతులేని ఆనందాన్ని
ఆస్వాదిస్తున్నాను అంతసేపూ !"

ఇది 'సుధ' లోని ఒక కవిత.

వచనకవిత్వంలో ఒకమహాకావ్యం కూడా వెలువడింది. అది శ్రీశార్వరిగారి "సావిత్రి" కావ్యానువాదం. అరవింద యోగి రచించిన "సావిత్రి" ఆధునికయుగంలో వెలువడిన ఆంగ్ల మహేతిహాసం. ఏతత్కృతికిది యోగ్యమైన భావానువాదం. ఇది 1. మహోదయం, 2. అన్వేషణ, 3. స్పందన, 4. యోగ విభూతి, 5. నిర్వాణం, 6. వరనిర్వాణం, 7. మహావర నిర్వాణం, 8. దివ్యజ్ఞానం, 9. దివ్యజీవనం అని తొమ్మిది భాగాలుగా వచ్చింది, ఇది తెలుగు సాహిత్యంలో నే అపూర్వమూ, అద్భుతమూ అయిన ప్రయత్నం.

5. <u>నాటకాలు</u> :- వీరేశలింగం పంతులుగారూ, చిలకమర్తి వారూ ఎన్నో నాటకాలు, ప్రహసనాలు రచించారు. వారు నాటకసమాజాల కోసమని వ్రాసినా ప్రజల్లో భక్తిభావాన్ని పెంపొందించడానికి ఆయాకవుల నాటకాలు ఎంతగానో తోడ్పడ్డాయి. తిరుపతివేంకట కవులు మహాభారతకథనంతటిని చక్కని నాటకాలుగా మలిచి యిచ్చి చిరకీర్తి నార్జించుకొన్నారు. ఉన్నవవారి "నాయకురాలు" ఎక్కిరాలవారి అశ్వద్ధామ, సుభద్ర నాటకాలు యోగవిద్యా రహస్యాలను ఇముడ్చుకున్న మహానాటకాలు.

6. <u>వచన గ్రంథాలు</u> :- ఆధునిక యుగం ఒకవిధంగా వచన రచనలయుగమని చెప్పదగింది. వీరేశలింగంగారు చక్కని వచనరచనకు మార్గదర్శనం చేశారు. వ్యావహారిక భాషావాదం బలం పుంజుకున్నాక మరిన్ని వచనరచనలు రాసాగాయి. పద్య రూపంలో ఉండే భారత, భాగవత, రామాయణాలూ, దేవీభాగవ తంవంటి ఇతర పురాణాలూ వచనం చేయబడ్డాయి. శ్రీనివాస శిరోమణి వాల్మీకిరామాయణాన్ని చక్కనిశైలిలో తెనిగించారు. యామిజాల పద్మనాభస్వామిగారు భాగవతాన్ని సరళసుంద రంగా అందించారు. పిలకా గణపతిశాస్త్రిగారు మహాభారతాన్ని మహావైభవంగా వచనరూపంలో అందించారు. ఇంకా ఎందరో పండితులు ఈవచనరచనలో సిద్ధహస్తులై చక్కని సాహిత్యాన్ని లోకానికి అందిస్తున్నవారు ఉన్నారు. ఇటీవల "అంతరార్థ రామాయణం", "అంతరార్థ మహాభారతం", "అంతరార్థ మహా

భాగవతం" అనేవి కూడా వచ్చాయి. డాక్టర్ వేదుల సూర్యనారాయణశర్మగారు 'దైవప్రేరణ' తో వ్రాసిన మహాగ్రంథాలివి. నండూరి సుబ్రహ్మణ్యశర్మగారు "మహాభారతోపన్యాసములు" అయిదు సంపుటాలుగా వెలువరించారు. ఉషశ్రీగారు 'ప్రసంగ శైలి'ని ఒకదానిని తెలుగుభాషకు పరిచయంచేసి, రామాయణ భారతాలను వచనంగా అందించారు.

7. <u>విమర్శలు :-</u> రామాయణ, భారత, భాగవతాలమీదా, ఇతర పురాణాలమీదా చక్కనివిమర్శలూ, పరిశోధనగ్రంథాలూ ఎన్నో వచ్చాయి. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు "మహాభారత తత్త్వకథనము" అనేపేరుతో భారతంపై వచ్చిన విమర్శలన్నిటికీ తగిన సమాధానాలిచ్చారు.

విశ్వవిద్యాలయాల్లో కూడా వీటిపై చెప్పుకోదగిన స్థాయిలోనే పరిశోధన జరిగింది. "భారతం-ధర్మాద్వైతం" అనే సిద్ధాంతగ్రంథం మహాభారతం మానవజీవితానికి ఏవిధంగా ఉపకరిస్తుందో, అందు ప్రతిపాదించబడిన పరమధర్మమేమిటో వివరించింది. "ఆంధ్రమహాభారతమూ-ద్రౌపది, ఒక ఐతిహాసిక విశ్లేషణ" అనే ఈవ్యాసకర్త రచించిన సిద్ధాంతగ్రంథంలో శ్రీకృష్ణుని జగద్వ్యూహమూ, అందులో ద్రౌపది, పాండవుల పాత్రలు వివరించబడ్డాయి.

8. <u>జీవితచరిత్రలు :-</u> "ఒక మహాపురుషుని జీవితమహత్త్వ లోకముచేత కలిగిన అబ్బురపాటు ప్రేరణకాగా, ఆ మహత్త్వ విశిష్టతను లోకులకు తెలుపుటకై వ్రాయబడెడి కథయే జీవిత చరిత్ర' అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి నిర్వచనము. ఇవి 1. ఇతరులచే వ్రాయబడినవి, 2. స్వీయచరిత్రలు అని రెండు రకాలుగా ఉంటాయి. శ్రీరామకృష్ణమఠంవారు రామకృష్ణ పరమహంస, శారదామాత, వివేకానందుల జీవిత చరిత్రలను చిరంతనానందస్వాముల వారిద్వారా తెలుగువారికి అందించారు. శిరిడీసాయిబాబావారి దివ్యచరిత్ర నలుగురైదుగురిచే వ్రాయ బడింది. సీతారామయతీంద్రులవారి చరిత్ర "ప్రేమమూర్తి-నామ కీర్తి'గా వెలువడింది, జిల్లెళ్ళమూడి అమ్మచరిత్ర 'మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలు'గా వచ్చింది. ఆత్మకథలుకూడా ఎన్నో వచ్చాయి. ఇటీవలే వచ్చిన "ఒకయోగి ఆత్మకథ" పరమహంస యోగానందగారి ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన "ఆటోబయోగ్రఫీ ఆఫ్ ఎ యోగీ"కి యోగ్యమైన అనువాదం. లాహిరీ మహాశయుల జీవితచరిత్రకూడా చక్కని అనువాదంతో వెలువడింది. "ప్రాక్ప శ్చిమాలు" అనే కులపతి ఎక్కిరాలవారి దినచర్య గ్రంథంకూడా ఈసందర్భంలో పేర్కొనదగింది.

9. <u>నవలలు :-</u> ఉన్నవవారి "మాలపల్లి", విశ్వనాథవారి "వేయిపడగలు", అడవి బాపిరాజుగారి నవలలు, తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారి "ధర్మనిర్ణయం", ఎక్కిరాల

కృష్ణమాచార్యులవారి 'మందస్మితజాలము', 'పురాణపురుషుడు', 'క్రీడామయుడు', 'పురుషమేధము' అనే నవలలూ ఆధ్యాత్మిక మహోత్తుంగ శృంగాలనుండి జాలువారిన అమృతపుష్పములు.

10. లేఖాసాహిత్యం :- తెలుగు సాహిత్యంలో వెలుగుచూడని మహత్తరమైన ప్రక్రియ ఈలేఖాసాహిత్యం. సిద్ధులైన మహాపురుషులు సాధకులకు ఇచ్చే ఆచరణయోగ్యమైన సూచనలు, పరిష్కారాలు కలిగి, ఉత్తమసాహిత్యశ్రేణికి చెందదగిన లేఖల సంపుటులు ఎన్నోవచ్చాయి తెలుగులో. "శ్రీరమణాశ్రమ లేఖలు", ఎక్కిరాలవారి శిష్యులు సంపుటీకరించిన 'ప్రేమలేఖలు' మొదలైనవి ఈకోవకు చెందుతాయి.

ఇంకా వర్గీకరణకు లొంగని సేకరణలు, సంభాషణలు (Discourses), అనుభూతుల వివరణలు, సందేహాలకు సమాధానాలు, మొదలైనవి ఎన్నోఉన్నాయి.

సాహిత్యము బుద్ధిజన్యమూ, హృదయజన్యమూ అని రెండు విధాలుగా ఉంటుంది. బుద్ధిజన్యమయినది పాండిత్యానికీ, తెలివితేటలకీ సంబంధించినదిగా ఉంటుంది. హృదయజన్యమైనది అనుభూతిప్రదంగాను, ఉత్తమసంస్కారాన్ని కలిగించగలదిగాను ఉంటుంది.

ఇంతవరకూ పరిశీలించిన సాహిత్యం కేవలం హృదయ సంబంధి. అది పేరు ప్రఖ్యాతులు నాశించి వ్రాయబడేది, పట్టాల

కోసం చదవబడేదీ కాదు. ఆర్తితోఉన్న వేలాదిమందికోసం ఆదుకోగల ఆత్మశక్తిగల మహానుభావులచే అందించబడింది. కనుకనే అది ఏవిద్యాలయాల్లోను దొరకదు. ఏగ్రంథాలయం లోను కనబడదు. గుండెగుడిలో భద్రపరుపబడి, నిత్యపారాయణం చేయబడుతున్న నిజమైన సాహిత్యం ఇది !

మనసాహిత్య చరిత్రను జాగ్రత్తగా గమనిస్తే కాలపరీక్షకు తట్టుకుని మనదాకా అందింది ఇలాంటి ఉత్తమ సాహిత్యమే ననేవిషయం బోధపడుతుంది. ఈదృష్ట్యా, భావితరాలవారికి మన ద్వారా అందేదీ ఇదేననడానికి సందేహమెందుకు ?

(యూ. జీ. సి. మైసర్ రిసెర్చి ప్రాజెక్టు నివేదిక)



# 9. చిన్నయసూరి అప్రస్తుతప్రశంస-ఒక అనుశీలన

*"మానితపు నడక పేరిమి*
*మానసమున కింపుఁబెంప మనునంచలకున్*
*బోనిడ నీరసనీరము*
*జానుగ క్షీరంబు గొనుట సహజమకాదే!"*

బాలవ్యాకరణపీఠికలో చిన్నయసూరి చెప్పిన ఈపద్యాన్ని సావధానంగా పరిశీలింపవలసిన అవసరం ఎంతైనా ఉంది.

"ప్రసన్నమైన యీవిన్నపమునందలి వినయగరిమ యెట్టిదో, యిందు గర్భితమయియున్న గాంభీర్యమెంతటిదో, ప్రతిపాదన రీతిలోని చిత్తసమున్నతి ఏయెత్తున నున్నదో గమనింపుడు" అని దువ్వూరివారి 'రమణీయ' విన్నపం.

సూరి వినయగరిమను, చిత్తసమున్నతిని ప్రక్కన పెట్టి, ఈపద్యంలో గర్భితమైయున్న విషయగాంభీర్యాన్ని పరిశీలిద్దాం.

'మంచిప్రవర్తనతో మనస్సునకు ఆనందము కలిగించే హంసలకు నీరసమైననీటిని విడిచిపెట్టి పాలను మాత్రమే స్వీకరించడం సహజమేకదా!' అని ఈపద్యానికి అర్థం. తనకు పూర్వమందుండిన వ్యాకరణాలు సంస్కృతసమాలకు లక్షణాలు బహుతరంగా చెబుతాన్నాయనీ, తక్కినభాషకు లక్షణగ్రంథం అవసరమనీ, కనుక తాను భాషాసమష్టికి లక్షణం లక్ష్యపూర్వకంగా చెబుతున్నాననీ పేర్కొని, ఆతర్వాత పైపద్యం చెప్పాడు సూరి.

ఇంతకు మించి ప్రత్యేకమైన సందర్భం ఈపద్యానికి లేకపోవ డాన్నిబట్టి మరేదో విషయాన్ని దృష్టిలో పెట్టుకుని సూరి ఈ అప్రస్తుత ప్రశంస చేశాడనిపిస్తోంది.

చిన్నయసూరికి ముందు తెలుగులో వ్యాకరణాలు లేకపో లేదు. సూరి పూర్వవ్యాకరణాలు స్థూలంగా రెండురకాలని చెప్ప వచ్చు. 1) దేశీయపండితులచే సంస్కృత వ్యాకరణ సంప్రదా యానుసారంగా వ్రాయబడిన వ్యాకరణాలు-ఆంధ్ర శబ్దచింతామణి, ఆంధ్రభాషాభూషణం వంటివి. 2) పాశ్చాత్య పండితులచే పాశ్చాత్యవ్యాకరణ పద్ధతులననుసరించి వ్రాయబడిన పద్ధనాత్మక వ్యాకరణాలు - 'వరూగియన్ గ్రామర్ (1728), 'ఎ గ్రామర్ ఆఫ్ ది జెంతూ లాంగ్వేజ్, (1807), ఏ కంపారిటివ్ గ్రామర్ ఆఫ్ ది ద్రవిడియన్ ఆర్ సౌత్ఇండియన్ ఫేమిలీ ఆఫ్ లాంగ్వే జెస్ (1856) మొదలైనవి. మొదటివర్గం కావ్యభాషకు, రెండవవర్గం వ్యావహారిక భాషకు ఉద్దేశింపబడినవి.

సూరి బాలవ్యాకరణము పూర్వసంస్కృత వ్యాకరణాల ననుసరిస్తూ, కావ్యభాష నుద్దేశించి వ్రాయబడినది. ఇది క్రీస్తు శకం 1858 లో వెలువడింది. సూరి మద్రాసులోని అప్టన్ పాఠశాలలోను; పచ్చయప్ప కళాశాలలోను, రాజధాని పాఠశాల లోను ఉద్యోగించాడు. ఆంగ్లభాషాపరిచయం బాగా కలిగినవా డవటంవల్ల క్రైస్తవపాదరీలు, ఆంగ్లేయోద్యోగులూ ఎందరో అతనివద్ద తెలుగు చదువుకున్నారు. తెలుగుసుగూర్చి ఆంగ్లేయ పండితులు చేసినకృషి సూరికి తప్పనిసరిగా తెలిసేఉంటుంది.

కాల్డ్‌వెల్ అనే మతప్రచారకుడు మద్రాసు కేంద్రంగా మతప్రచారం చేసికొంటూ తమిళ, కన్నడ, తుళు, తెలుగు మొదలైన భాషలను నేర్చుకుని, యివన్నీ ఒకే భాషాకుటుంబానికి చెందినవని ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. క్రీ. శ. 1856లో అతడు తన సిద్ధాంతగ్రంథం కంపేరిటివ్ గ్రామరును ప్రకటించాడు. అందులో ద్రావిడులనే జాతివారు ఆర్యులకంటె భిన్నమైన సంస్కృతీ, నాగరికతా కలిగి, ఆర్యులకంటె పూర్వమే దేశంలో ఉండేవారనీ, ఆర్యులు వారిని వింధ్య క్రిందిభాగానికి తరిమివేసి ఉత్తరదేశాన్ని ఆక్రమించారనీ, నేటిదక్షిణాది భాషల వారు ఆనాటి ద్రావిడజాతి సంతతివారనీ ప్రతిపాదించాడు. ప్రజల వాగ్వ్యవహారంలోగల ఈభాషల సామ్యాన్నిబట్టి యివన్నీ సంస్కృత భిన్నములని అతడు నిరూపించాడు. అయితే, భాషా కృషి పేరుతో భారతజాతిని విభజించడం, ఆర్యసంస్కృతికి, సనాతనధర్మానికి దెబ్బకొట్టడం ఆనాటి క్రైస్తవ పండితుల పరమార్థమని బుద్ధిమంతులైన పండితులనేకులు కనిపెట్టి, ఘోషించారు. కాల్డ్‌వెల్ ప్రతిపాదనలకు ఆనాడు దేశంలో తీవ్రమైన ప్రతిఘటన వచ్చింది.

భారతీయసాహిత్యమంతా మతంతో ముడిపెట్టుకొనిఉందన్న సంగతిని పాశ్చాత్యులు గుర్తించి, ప్రజలను ఆసాహిత్యం నుండి దూరం చెయ్యడానికి ఎంతగానో తాపత్రియ పడ్డారు. భాషోద్ధరణ మిషతో మతంతో ప్రమేయంలేని ఏవో కొన్ని కావ్యాలనుమాత్రం దేశీయపండితుల సాయంతో పరిష్కరించి ప్రకటింపజేశారు.

వేమనవిషయంలో బ్రౌన్‌దొర చేసిందికూడా అంతమాత్రమే. వేమన పద్యాల్లో ఆధ్యాత్మికతకు, యోగానికి సంబంధించిన వందలాది పద్యాలను వదిలేసి, సమాజంలోని లోపాలను సంస్కరించడానికి అతడు చెప్పిన పద్యాలను మాత్రమే బ్రౌన్ ప్రకటింపజేశాడు.

ఇలా దేశానికి, జాతికి, భాషకూ జరిగిపోతున్న అన్యాయాన్ని గుర్తించిన ఏదేశీయ పండితునికైనా బాధ కలగడం సహజమే. సూరి పై పద్యాన్ని అలాబాధపడుతున్న పండితులను ఉద్దేశించి చెప్పాడని మనం గ్రహించవలసిఉంది. అలాఅనుకొంటే పైపద్యంలోని ప్రస్తుతాంశాన్ని ఇలా వివరించి చెప్పుకోవచ్చు.

'నేడు వస్తూన్న అప్రాచ్యపు భాషావ్యాకరణాల్ని గూర్చి కలతపడకండి. అవన్నీ నీరసనీరపుల్లాంటివి. హంసలవలె మీరు వాటిని వదిలివేసి, సారవంతమైన పాలవంటి ఈవ్యాకరణాన్ని గ్రహించండి.'

ఇది భాషాదురవస్థకు చురపిల్లుతున్న సాటి పండితుల్ని దృష్టిలో పెట్టుకుని చెప్పిందేకాని అసందర్భంగా ఏదో వ్రాశాడులెమ్మని అర్థంచెప్పుకుని వదలివేయాల్సిన పద్యంమాత్రం కాదు.



# 10. సాహితీలోకంలో 'నూతనవిలువ' ల ఆ వ శ్య క త

శాకాహార భోజనశాలకుపోయి మాంసాహారం కావాలన్నా మాంసాహార భోజనశాలకు పోయి శాకాహారం కావాలన్నా జనం వింతగా చూస్తారు.

ఆత్మతత్వాలు పాడుకునేవాడ్ని అభ్యుదయగీతాలు చెప్ప మనడం, అభ్యుదయ కవిని ఆత్మనుగూర్చి చెప్పమనడం కూడా అంతే ఒకవిధంగా!

దురదృష్టవశాత్తూ తెలుగుసాహిత్యంలో సరైన సాహిత్య వర్గీకరణ ఇంతవరకూ జరగలేదు. అందువల్ల అభిమానసంఘాల వాళ్ళు ఒకరి హీరోబొమ్మలమీద ఇంకొకరు బురదా, పేడా విసురుకుంటున్నట్లుగానే ఒక కవిత్వాన్ని ఇష్టపడేవారు ఇంకో కవిత్వాన్ని దుయ్యబడుతున్నారు. లేదా నన్నయ్యనుమార్క్సిస్టు దృక్పథంతో చూడాలని కొందరంటె శ్రీశ్రీని తాత్త్వికదృష్టితో అర్థంచేసుకోవాలని కొందరు వాదిస్తున్నారు.

కవిత్వాన్ని స్థూలంగా రెండువిధాలుగా వర్గీకరించుకోవచ్చు.

1. అనుభూతిపరమైనది
2. ఆవేశాత్మకమైనది

అనుభూతిలో ఉండే అంతరాలనుబట్టి అనుభూతిపరమైన కవిత్వంలో స్థాయీ భేదాలు ఉండటానికి అవకాశం ఉంది. లక్ష్యాలనుబట్టి మాత్రమే సూక్ష్మతరమైన ఈ భేదాలను చేయగలుగుతాం.

ఆవేశాత్మకమైన కవిత్వంలో మళ్ళీ ఆవేశంలోని అంతరాలనుబట్టి అనేకమైన భేదాలుండటానికి అస్కారం ఉంది. ద్వేషం, అసహ్యం, కామం మొదలైనవి న్యూనావేశాలు. ప్రేమ, జాలి, సానుభూతి మొదలైనవి ఉన్నతావేశాలు.

అటు అనుభూతికీ, ఇటు ఆవేశానికీ కూడా చెందకుండా ఉండే మధ్యరకపు కవిత్వం కూడా ఉండే అవకాశం ఉంది. ఒక విషయాన్నిగూర్చి ప్రత్యక్షమైన అనుభవం లేకుండా, కావాలని తెచ్చిపెట్టుకున్న ఆవేశంతో కవిత్వం చెప్పడానికి ఏకవి అయినా పూనుకోవచ్చు. దాన్ని మనం మూడవతరహాకు చెందినదిగా చెప్పకోక తప్పదు. దానికి ఆలోచనాత్మక కవిత్వం అని పేరు పెడదాం.

ఈవర్గీకరణ కవిత్వపు పుట్టుకకు సంబంధించినది. అంటే, కవులపరంగా చేసినవిభజన అన్నమాట!

మరొకరకమైన వర్గీకరణ కూడా ప్రస్తుత పరిస్థితుల్లో మన సాహిత్యానికి చాలా అవసరం. ఈ విభజన సాహిత్యస్వభావం దృష్ట్యా చేసేది. తెలుగుసాహిత్యమంతా ఈ ప్రకారం చూస్తే—

1. ధార్మికం,
2. చారిత్రికం,
3. రాజకీయం,
4. సాంఘికం,
5. వైయక్తికం,

అని అయిదువిధాలుగా ఉంటోంది. ఈఅయిదువిధాలకు చెందిన సాహిత్యంలోనూ పైన చెప్పిన కవులపరమైన, మూడు అంతరువులూ ఉంటాయనడంలో సందేహంలేదు.

ఉదాహరణకు, నన్నయ, తిక్కన, పోతనల సాహిత్యం ధార్మికం క్రిందకు వస్తుంది. వారి రచనలు అనుభూతి ప్రధానంగా ఉంటాయి కనుక, వారిది అనుభూత్యాత్మకమైన ధార్మిక కవిత్వం అవుతుంది. శివకవులను తీసుకుంటే వారిలో ఆవేశం ప్రముఖంగా ఉన్నట్లు స్పష్టమవుతుంది. అందువల్ల వారిది ఆవేశాత్మకమైన ధార్మికకవిత్వంగా చెప్పవచ్చు. శ్రీనాథుడు, అష్టదిగ్గజాలు మొదలైనవారి సాహిత్యం ఆలోచనాత్మకమైన ధార్మిక కవిత్వం క్రిందకి వస్తుంది.

ఒకేకవి ఆవేశమూ, ఆలోచనా, అనుభూతి అనే మూడు కక్ష్యల్లోనుంచీ వేరువేరు సందర్భాల్లో కవిత్వం చెప్పవచ్చు. తిక్కనగారి నిర్వచనోత్తర రామాయణమూ, మహాభారతమూ; ఎర్రనగారి హరివంశమూ, నృసింహపురాణమూ, మహాభారత

శేషమూ: పోతనగారి వీరభద్రవిజయమూ, మహాభాగవతమూ విమర్శించిన పండితులు ఈకక్ష్యాభేదాలను కొంతవరకూ గమనించ గలిగారు.

అలాగే, ఒకకవి ధార్మికరచనలూ, చారిత్రిక రచనలూ, రాజకీయాలకు సంబంధించిన రచనలూ, సంఘసంస్కరణదృష్టితో కూడిన రచనలూ, వైయక్తికానుభూతికి చెందిన రచనలూ చేసి ఉండవచ్చు. విశ్వనాథవారి సాహిత్యాన్ని ఉదాహరణగా తీసు కొంటే, వారి రామాయణ కల్పవృక్షం మొదలైనవి ధార్మికరచ నలు; పురాణవైరగ్రంథమాల పేరుతోవచ్చినసవలలు చారిత్రక రచనలు; వేయిపడగలు, చెలియలికట్ట మొదలైననవలలు సాంఘిక రచనలు; కిన్నెరసానిపాటలు, మధ్యాక్కరలు, వరలక్ష్మీ త్రిశతి మొదలైనవి వైయక్తిక రచనలుగా చెప్పవచ్చు. చలం పూర్వా శ్రమానికి చెందిన సాహిత్యమంతా సాంఘికం క్రిందకు వస్తుంది. అరుణా'చలా'నికి చెందిన సాహిత్యమంతా ధార్మికం క్రిందకి వస్తుంది. ఆవేశమూ, అనుభూతి కక్ష్యలతేడా మనకి స్పష్టంగా చలం రచనల్లో కనిపిస్తుంది.

ఈవర్గీకరణకు ప్రక్రియాభేదంతోకాని, కాలికభేదంతో కాని నిమిత్తం లేదు. ఒక రచన అనుభూతికి చెందిందా? ఆలో చనకు చెందిందా? ఆవేశానికి చెందిందా? అది ధార్మికమా? చారి త్రికమా? రాజకీయమా? సాంఘికమా? వైయక్తికమా? - అనే అంశాల దృష్ట్యా మాత్రమే ఈ పరిగణన చేయవలసిఉంటుంది.

ఈవిధమైన అవగాహన సాహిత్యస్రష్టకు ఉండితీరాలి. తాను ఏకక్ష్యలోనుంచి దేనికి సంబంధించిన రచన చేస్తున్నాడో తెలియకపోతే సాహిత్యకారుని కృషి గ్రుడ్డెద్దు చేలో పడ్డతంతు అవుతుంది. ఒకకవి తన అనుభూతిలోనుంచి సాంఘిక అసమానతను గూర్చి చెప్పదలిచాడనుకొందాం. సాంఘిక అసమానతకు చరిత్రతోను, రాజకీయంతోను, మతంతోను సంబంధం ఉంటుందిగదాని వరుసబెట్టి అన్నిటినీ స్పృశిస్తూ పోకూడదు. తాను ప్రతిపాదించ దలుచుకున్నది సూటిగా హృదయాలకు తాకేలా ఉన్నదా లేదా అనిమాత్రమే చూసుకోవాలి. శ్రీశ్రీ రచించిన "భిక్షువర్షీయసి" అనేకవిత ఇందుకు చక్కనిదృష్టాంతం.

సాహిత్యవిమర్శ విషయానికివస్తే, ఈవిధమైన అంతరువులూ, వాటివాటి వ్యాప్తీ, పరిమితీ- ప్రయోజనాల జ్ఞానం విమర్శకునికి తప్పనిసరి. పిడుక్కీ, బియ్యానికీ ఒకటే మంత్రం అన్నట్లుగా శ్రీశ్రీని, విశ్వనాథనూ ఒకేవిధమైన ప్రమాణంతో చూస్తామంటే ఎలా కుదురుతుంది? 'మనుచరిత్ర'కు టీకాతాత్పర్య సహిత వ్యాఖ్యానం వ్రాసినట్లుగా 'మహాప్రస్థానా'నికి వ్రాయడం సాధ్యంఅవుతుందా? దేనిప్రమాణం దానికి ఉండటం శాస్త్రీయ విమర్శ లక్షణం. సాహితీలోకంలో అప్పుడు మరింక పేచీలకు తావుండదు. ఎవరిపరిధిలో వారు అతిరథులూ, మహారథులూ అనే అవగాహనకు ఈవిధమైన నూతనదృష్టి ఎంతగానో దోహదం చేస్తుంది. పాఠకులలోను 'సహృదయత' పెంపొందితీరుతుంది.



# పండితరాయ రిసెర్చి సెంటర్
## శ్రీకోనసీమ భానోజీరామర్సు కళాశాల, తెలుగుశాఖ
## అ మ లా పు ర ం.

ఆశయాలు :-

1. వేద, శాస్త్ర, సాహిత్య, కళాక్షేత్రమయిన కోనసీమలో తెలుగు సాహిత్య పరిశోధనను ప్రోత్సహించుట,
2. తాళపత్ర గ్రంథాల సేకరణ, పరిష్కరణ,
3. అమూల్య అముద్రిత గ్రంథ సేకరణ,
4. అలభ్యమైన పరిశోధనాత్మక వ్యాసాలను, గ్రంథాలను పరిరక్షించుట, ప్రచురించుట,
5. సాహిత్య సంబంధమైన వివిధాంశాలపై సదస్సులు నిర్వహించుట.

గౌరవాధ్యక్షులు :- శ్రీ జె. వి. జి. ఆర్. భానో, M.A ,L.L B., కళాశాల వ్యవస్థాపక వంశపారంపర్య సభ్యులు

అధ్యక్షులు :- శ్రీ మంథా సాంబశివశాస్త్రి, (ప్రిన్సిపాల్)

కార్యవర్గం ;- 1. డాక్టర్ వాడపల్లి చక్రపాణిరావు
2. డాక్టర బి. వి. రమణమూర్తి
3. డాక్టర్ ద్వా. నా. శాస్త్రి